శ్రీరస్తు

---

శ్రీమద్గురుభ్యోన్నమః

శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీమత్పందడివంశపయః పారావారసిశాంకర నాగాహ్వయ

గురుచరణకమల మరందపానతుందిల షట్పదిందిం

దిరాయమాన మానసుడగు పెనుగొండ

ముకుందదాసుచే రచియింపంబడిన

# భాగవతాపరాధగజకేసరి,

గురుశిష్యుల సంవాదము - జ్ఞానబోధ.

---

ఈ వే గ్రంథములు.

లేఖకప్రమాద జనితదోషంబులు లేకుండునటుల సవరింపంబడి.

ఇయ్యది,

బి. వి. రంగయ్యాశెట్టిగారి స్వకీయ.

శ్రీలక్ష్మీ నృసింహవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడెను.

చెన్నపట్టణము.



28.11.12.

---

వెల

శ్రీరస్తు.

# చందాదారుల నామదేయములు.

శ్రీవగ్యాకుపల్లె శ్రీలక్ష్మీనారాయణ స్వామివారు
నివాసం తాలూకే నంది గ్రామం
వెచ్చా- పెదలచ్చయ్యకొమారుడు శేషయ్యగారు
రంగయ్య కొమారుడు వెచ్చా- కన్నయ్యగారు
వెచ్చా- నాగయ్యగారు
వెచ్చా చిన లచ్చయ్య కొమారుడు రామయ్యగారు
వెచ్చా- నారయ్యగారు
ముద్రా రాజయ్యగారు
రాయపూడి వేదాద్రిగారు
రాయపూడి వెంకట్రామయ్యగారు
వెచ్చా- పేరయ్యగారు
సందడి శ్రీరామదాసుడు
చిర్వాచిదానందను భక్తుడు చెన్నా అప్పుడు విష్ణుశేవకుడు
పెంటేలవారిగోడెం
ఇరుకుళ్ళపుల్లయ్యగారు
మేళ్లచెరువు హనుమయ్య గారు కొమారుడు నాగయ్యగారు
వత్సవాయి
గుర్రం గుర్వయ్యగారు
శివాపురం తా॥ నందిగామ
పూట్ల లక్ష్మయ్యగారు
మేలూరు సుబ్బయ్యగారు

గండగలపాడు తా॥ ఖం మం
తెల్లాకుల పేరయ్యగారు
అన్నపాలెం బంజర తాలుక- కూనుకోట చీకటిమళ్ల పకీరయ్య వ॥ తిరపతయ్యగారు
వేములనర్వ తా॥ నందిగామ
చేడె అప్పయ్య కొమారుడు నాగయ్యగారు
మేదరమెట్ల వెంకయ్యగారు
మధిర- తా॥ మధిర
కట్టా వెంకట్రాయుడుగారు
పాతలింగాల తా॥ ఖం మం
నాగుబండి పిచ్చమ్మగారు
ఖంమం తాలూక ఖంమం
పట్టెవర్ధనం సీతారాంరావు వకీల్ గారు
తేరాల రామదాసుగారు
గ్రంధి రామదాసు- వ॥ బాపనయ్యగారు
సోమా పెదకోటయ్యగారు
సోమా చినకోటయ్యగారు
యన్నా నరశింహం వ॥ బాపనయ్యగారు (గారు॥)
వంగవీటు వేదాద్రి వ॥ రాఘవయ్య
రంగా పెద్దవెంకట లచ్చయ్య గారు
శ్రీకాకోళ్ళపు రామయ్య వ॥ అంతయ్యగారు

మహా॥ రా॥ శ్రీ॥
కర్నూలు బుచ్చిరామయ్యగారు
మూసై లక్ష్మీనారాయణగారు
షరాబుమల్లయ్యగారు
అదారపు కాయన్న వ॥ రామయ్య గారు
పోలిశెట్టి రామయ్య వ॥ వెంకయ్య గారు
రంగా లింగయ్య వ॥ వెంకట నర్స య్యగారు
యీగారంగయ్య వ॥ వెంకటప్పయ్య గారు
రాచర్ల రామయ్య వ॥లింగయ్యగారు
నాళ్ళక్రిష్ణయ్య వ॥ వెంకట్రామయ్య గారు
చాకలవరపు నరసింహం వ॥ అమ్మ య్యగారు
బ్ర॥ శ్రీ॥ నపర్తి లక్ష్మీనరసయ్య కొ॥ ...ళ్వారుగారు
కొల్లిమల్లయ్యభ...డు
కర్ణాటినరసమ్మభర్తురాలు
బండారు రాములు
బొమ్మకల్‌రయిల్‌స్టేశన్ షరాబురా యపూడి రంగయ్య శెట్టిగారు
తా॥ ౫౦ మం
చొప్పకట్లపాలెంతా॥ ౹ంమం
సొంఘ్నాతుల నరశింహారావుగారు
మిట్టపల్లి పట్టాభిరామయ్యగారు
కాకలగర పాకలచ్చాయి
మ॥ రా॥ చిరువోములతా॥ ౹ంమం

రా॥ పెనగుంట్ల సీతారామయ్యగారు
వేపశేరు వెంకట్రామారావుగారు
వేపశేరు రామచంద్రయ్యగారు
అదాలతు వెంకటరామారావుగారు
శాకమూరి నరసయ్యగారు
శాకమూరి రామయ్యగారు
మిట్టకోల శీతారాములు చొప్పకట్ల పాలెం (లచ్చగూడెం)
వేములపల్లి కోటయ్యగారు
కారేపల్లి తా॥ యిల్లెందు పెరుమాళ్ళ గుర్వయ్యగారు
విశ్వనాధపల్లి
గొరయ్యడ శ్రీరాములు భర్తుడు
గోవిందాపురం తా॥ ౹ం ౹ం
కేసా లక్ష్మణదాసుగారు
కేసా గుర్వయ్యగారు
జవ్వాజిలచ్చయ్యగారు
యునిగంటి లక్ష్మాంబగారు
మ॥ రా॥ మారేపల్లి తాలూక
తిరువూరు
డొటూరు రామ కృష్ణయ్య గ్రామ మునసబుగారు
గుర్రంజగ్గయ్యగారు
మ॥ రా॥ పోలిశెట్టిపాలెం
ఊటూరు- శేషయ్యగారు
కంభంపాడు
యలమర్తి రామయ్యగారు
కముతం వెంకయ్య వ॥ బసవయ్య గారు
కముతం తల్లమ్మగారు

| | |
|---|---|
| రామన్నపాలెం | ముత్తగూడెం తా॥ మధిర |
| సగ్గుర్తి రామయ్యగారు | తిరుమనిశెట్టి వెంకటదాసు |
| కొంగర పెదవెంకయ్యగారు | తిరుమనిశెట్టి రామదాసు |
| కొంగర రామయ్యగారు | తిరుమనిశెట్టి అప్పలదాసు |
| కొంగర రామదాసయ్యగారు | తిరుమనిశెట్టి ఎరదాసు |
| వాళ్ళ రామయ్యగారు | బగాస లక్ష్మణదాసు |
| వెల్ది పద్దయ్యగారు | గూడవెల్లి నరిశింహదాసు |
| వెల్ది ముత్తయ్యగారు | గూడవెల్లి అప్పలదాసు |
| వడ్లముడి ముత్తయ్యగారు | గూడవెల్లి కోటప్పదాసు |
| మునగలపాటోరి గూడెం | బయ్యవగూడెం |
| యఱ్రగుంట్ల శేషదాసు | పుయ్యూరు రామచంద్రయ్యగారు |
| కొమిరబోయిన పరదేశిభక్తుడు | దొంతు రామదాసు |
| కాకర్ల తాలూక తిరువూరు | చిల్లపల్లి సుబ్బదాసు |
| సగ్గుర్తి వీరయ్యగారు | పామర్తి నాయుడు విష్ణుభక్తుడు |
| లక్ష్మీపురం | దబ్బాకుపల్లి - చేడె శ్రీరాములు |
| బొల్లినేని రత్తయ్యగారు | హనుమయ్య. |

యీపుణ్యాత్ములందరు నివ్వబడిన ద్రివ్యసహాయమువల్ల యీగ్రంథము ప్రచురింపంబడినది.

# వీరలందరిని.

క॥ ధనమునుధాన్యముసంపద।
ఘనముగసద్బుద్ధిధర్మ సద్గ్రంథశ్రవణం।
బనయంబుభూతదయయును।
మనములరగనిచ్చిబ్రోచు సన్మైథిలిపతియున్॥

శ్రీ ర స్తు.

---

శ్లో॥ గురుత్యాగీమహారోగీ। మంత్రత్యాగీదరిద్రతః। గురుమంత్రద్వయంత్యాగీ। రౌరవంనరకంవ్రజేత్॥ ౧॥ మద్భక్తాశంకరద్వేషీ। మద్ద్వేషీశంకరప్రియః। తావుభౌనరకంయాంతి। యావచ్చంద్రదివాకరః॥ ౨॥ వాకుర్వదత్తంమనోదత్తం। దారాదత్తంతథైవచ। తత్తద్వ్యాపహారేణ। చండాలఃకోటిజన్మసు॥ ౩॥ అహోరాఘవ రాజేంద్ర। సప్తకల్పానుజీవనం। నశ్రుణోమినపశ్యామి। స్వయందత్తాపహారిణాం॥ ౪॥ ఇంద్రంద్వియత్తనమంత పూర్వముదధీం పంచాననం పద్మజం। అగ్నిస్వాధుజలం శివంశితగళం కామంచసద్విగ్రహం। శైలాపక్షధరాంతథైవవచ హయానులక్ష్మీపతిం శింగళం। జానేసర్వమిదంతునోరఘుపతే దత్తాపహారాంమినః॥ ౫॥

శ్రీ ర స్తు.

---

శ్రీమద్గురుభ్యోన్నమః.

త్రిమూర్త్యగ్ర స్త్రీశక్తి స్తోత్యము.

క॥ గోవిందమృదుచరణా। యరవిందమునందుసిల్పి రాత్రింబగలున్। భావించెదపూజించెద। సేవించెదనన్నుబ్రోవు శ్రీరఘురామా॥ ౧॥ కుండలశాడితరిపుజన। ఖండనకోదండహరణ కౌసలితనయా, ఖండలవందితశతమా। ఖాండులకోట్లభాతి దశరథరామా॥ ౨॥ కొండల్లుసికొండెల్లుని। కొండకుసుతుగనినవాని కోర్యాయుదీరన్। ఖండెందుతలధరించియు। దండిగపులిచర్మధారిన్ దలతునురామా॥ ౩॥ ధరవారి అన్నజనులకు। సరిత్రాలును వ్రాయుచున్న సరసిజగర్భా। మారవైరిసుతుడనినుమతి। మరువకధ్యానింతువేగమంజులరామా॥ ౪॥ కూపారకన్యపదములు। నాపాగన్నల దాపిబ్రోవదలకదనిరతం। రూపించిమోక్షమిచ్చియు। పాపైకతీంపవయ్య పావనరామా॥ ౫॥ పెద్దమ్మచెల్లినెప్పుడు। హద్దును మరియురకేను యాత్మలదలతున్। ముద్దుగనేబమ్మశ్రీహరి। సద్దునుమరిజేయకయ్యచకరానిరామా॥ ౬॥ కమలముకుసవతిపదంబుల్। భ్రమదాయకపూజజేతు బ్రహ్మజ్ఞానం। సమబుద్ధిజేసినాపగుమయి। రమణీయ్యాముగానునిపుడు రఘుకులరామా॥ ౭॥ వనజం

బుసుతునిసతిపత। వనజంబులు నాదుహృదయ వనజమునందుఁ । వనజంబు లుపూజించెద। దనరగకవివృద్ధి జేయధరణిలా రామా॥ ౮॥. వ్యాళంబుశయ్యా సీతుసు। వ్యాళముపైచిందులాడి వ్యాళము నేలి। వ్యాళంబుబట్టిజీల్చివ । వ్యాళాంతకగమనబ్రోవు యవనిజ రామా॥ ౯॥ దిండివడిదండిరిసఖుడవు। దండిగసిరిమూండమాల దైతయసీతుఁ। కొండెములవానిదండ్రికి। ఖండితముగజనకుడై నకారణ రామా॥ ౧౦॥ తల్లి నిబ్రోచియు వేరొక। తల్లి కితత్వంబు దెల్పి తల్లి నిజంపి। తల్లి కిముద్దులుజూపియు । తల్లికితల్లైన వాని దండ్రివి రామా॥ ౧౧॥ గజ మేలియు గజముద్ధ్రంచియు। గజముఁ జంపించి నావు గజపురిని ల్పి। గజగామినిపరిణమాడియు। గజములపైజగమునిలుప కారణ రామా॥ ౧౨॥ మామనుజంపియు వేరొక । మామతో యుద్ధంబు జేసి మామనుబ్రోచి। మామకు కన్నులనొసగియు। మామనుధరరాజు జేయమంజుల రామా॥ ౧౩॥ గిరి నొకటి దెచ్చి వేగమె। గిరిక్రిందనునిల్పి నావు కృపతో జనులఁ। గిరినొకటి లేపి బ్రోచిన। గిరికల్లునకల్లుడైన కేశవ రామా॥ ౧౪॥ నొకకన్యనురక్షించియు। నొకకన్యనుశిక్ష జేసినొకసతి నేలి। నొకకన్యకు దెల్పితత్వము। నొకకన్యయు నిన్నుగట్టె నోరఘు రామా॥ ౧౫॥ బ్రతికించినొకభామను। సతతము రక్షింతువనవ సతినొకదానిఁ। పతియొల్ల నిసతి నేలియు। గతినీవనినమ్మి నాను గావుము రామా॥ ౧౬॥

## సకలసద్గుణ సంపన్నులు దెలియుటకు.

క॥ కొంచముగా దాశింపవ్వను।
కొంచముగా దామరీచి కులిశాయుధ మును।
కొంచముగా దాదీపము।
కొంచముయనరాదునివియు కుంభినిలోనఁ॥

తా॥ సంస్కృతమనే అరణ్యమునకు ఆంధ్రమనే గొడ్డలిచేత బయలుచేసినరీతిగా యీగ్రంథము తెనుగు పదములని నిరాకరించక చదువుకొ గలరు సారాంశము గ్రహింపగలరు॥



శ్రీరస్తు.

---

శ్రీమద్గురుభ్యో నమః.

శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః.

# భాగవతాపరాధ గజకేసరి.

---

శ్రీమద్భక్తగణాపదూషణగజా శింహద్వమృగేంద్రంబు యీ।
భూమిన్ గ్రంథము జేయబూనితిని నే పూజించి నాగార్యులన్।
ప్రేమే మారక అచ్చమాంబ పదముల్ పెంపొందగా మ్రొక్కితిన్।
ధీమంతుల్ మదిసంతసించి గనుడీ దివ్యంబుగా కాశ్యపిన్॥

క॥ హరికవులకు నవకవులకు । హరిభక్తికి తత్వమునకు నార్యుల కెల్లన్।
ధరగణపతి శారదమ్మకు। చరణంబులు గొల్తు భక్తి చరణము దలతున్॥
శ్రీరాముల జనకజ పద। సారసములు నాదు హృదయ సారసమందున్।
వారక జేర్చియు మ్రొక్కితి । భారము మీదనుచు నాదు భక్తిన్ శక్తిన్॥
పెనుగొండవంశవార్ధికి। మనమలరగ చంద్రుడనగ మహాజనియించెన్।
ఘనశీతరాముడందురు । బనువుగ పెద్దలిడెనాయ నామంబును వేగన్॥
వారికి సుతులము మేమును। ధారుణిజనియించె రామ దాసను పేరన్।
కూరిమిననుముకుందుడని । వారక బిల్చెదరు లెస్స వసుధలో వేగన్॥

వ॥ అని యీ ప్రకారంబున ఇష్టదేవతాప్రార్థనంబును సద్గురువందనంబును సమస్త సత్కవివినుతియును సదాజ్ఞానులసన్నుతియును సకలభక్తజనంబులు మిక్కిలి ప్రేమగలుగ పూజయును గావించి మిక్కిలి కుకవులను సేవు కొనియును శ్రీసీతారామస్వామికి సమర్పితంబుగా నాయొనర్పంబూనియున్న సమయంబునా॥

సకలసద్గుణసంపన్నుండైన నొక భక్తుండు మత్సన్నిధికి వచ్చి వినయ విధేయపూర్వకంబుగా మిక్కిలి ప్రార్థించి వినమనియిట్లనియె. స్వామీ [illegible] దాసా ఈ భూమండలమధ్యంబున కృత త్రేతా ద్వాపరంబుల మహానుభావుల చేరచియింపంబడిన అనేకగ్రంథములలో వాక్శక్తికి [illegible]

గాని అనేకమార్గంబులుండుటవల్ల తృప్తిదీరక యిప్పుడు యీకలియుగంబు
న శ్రీమత్పండిత-నాగ దేశికులగువారువిరచించిన సకలతత్వార్థదర్పణము మ
తవివాదపరిహారము- దుర్మతఖండనము మోక్షమార్గదర్శనము- అచలాం
తరార్థము భక్తమార్గనిరసనము విగ్రహార్చనసిద్ధాంతము లోనుగాగలవి
సుమారు- ౪౦- ౫౦- గ్రంథంబులుకృతియించిరి ఆగ్రంథము లన్నియు వ
కేమార్గమున యున్నందున కష్టానందముగచదివి సారాంశముగ్రహించి
నా సకలసందేహములు దీర్చుకొని కృతార్థుడనైతినిగని యిప్పటినవనాగ
రికులైన బుద్ధిమంతులు బహుమంది గురుశిష్యులలో కొందరు మేమేశ్రేష్ఠుల
ము మాకేసర్వము తెలుసును మాకే మోక్షము మీకేమియును దెలియదు మీ
కుసద్గతి లేదని వాదింతురు మరికొందరుజపతపములు జేయువారలనిందింతురు
ఇంకాకొందరు మధుమాంససంగంబులుజరిగించవచ్చును ఆజీవులు మనుష్యు
లుతినుటకే బ్రహ్మపుట్టించినాడందురు నంములో కొందరు జననమరణంబు
లులేవందురు నింకాకొందరు పుణ్యపాపంబులువట్టిదందురు నరకస్వర్గము
లుఅబద్ధమందురు వారిలోకొందరు సోహమె బ్రహ్మమందురు మిక్కిలిగా
కొందరు విగ్రహార్చన జేయవద్దని వేమయ్యగారిచెప్పినారందురు వీరికన్న
కొందరు తోలికేదిరాయిగళ్లోటిరాయి గోడకట్టేదిరాయని నిందింతురు
వారిలోకొందరు ,,చిల్లరరాళ్లకు మ్రొక్కెనమనుజుని చిత్తముజెడురా వరే
వరే,,అనుచుజెప్పినారని ఘట్టిగా ట్టుబట్టి వాదించుచు కాలాంతకులవలె బె
దిరించుచుందురుగాన యీప్రశ్నలకన్నిటికిని సదుత్తరంబులుగురుశిష్యసం
వాదంబుగాబోధించి నన్నుకృతార్థునిగాజేసి రక్షించుమని ప్రార్థింపగావిని
సంతుష్టాంతరంగుండనై పలుకనిశ్చయించితిని.

శ్రీసద్గురు సహాయము.

క॥ గురుశిష్యులసంవాదము । పరికింపగగల్గుభక్తి § బ్రహ్మజ్ఞానం।
నిరతమువిన్నను చదివిన । కరమొప్పసుఖంబులన్ని § గల్గును ధాత్రిన్॥

ఇప్పుడు నేనుజెప్పబోవుచున్న గ్రంథము వకటి రెండుసారులుగాది
అనగా మొదటినుంచి తుదవరకుచదువుకొని సారాంశముగ యున్న మొత
ఆ అమృతపానంబు జేయుడి లేదా పిచ్చిగాయుండెనేని నన్ను నిందింపక. మీ
[illegible] గ్రంథములరచియించి ప్రచురించ[illegible]

భయము నేను చదువుకొని నీతికన్న సారవంతంబుగా యుండెనని దీని ననుకూ-
లముగా నడుచుకుందును ఇదే నావిజ్ఞాపనము॥

గ్రంథమునకు ప్రారంభము.

శిష్యుడు:— అయ్యా గురుస్వామి యిప్పుడు గురుశిష్యులలో కొంద-
రు మేమే తెలిసినవారము మాకన్న యెవ్వరు లేరని చెప్పెదరు సర్వము తెలిసిన
వారు యీప్రకారము వాదింతురా అనిన శిష్యునకు గురుండిట్లనియె.

గీ॥ గంగ పారుచుండు § కదలనిగతితోడ। మురికివాగు పారు § మ్రోతతోడ।
కంచు మ్రోగినట్లు § కనకంబు మ్రోగున। విశ్వదాభిరామ § వినర వేమ॥

గీ॥ అల్పజనుడు బలుకు § నాడంబరముగాను। సజ్జనుండు బలుకు § చల్లగాను।
కంచు మ్రోగినట్లు § కనకంబు మ్రోగునా। విశ్వదాభిరామ § వినర వేమ॥

తా॥ సర్వము తెలిసిన మహానుభావులు గంగాది మొదలుగాగల నదు-
లు మిక్కిలి గంభీరముగాను కదలకుండా యున్న రీతిగా వుందురుగాని మురికి
వాగులు యేరులు పారినట్లుగ అనగా పెద్దధ్వని బుట్ట జేసి చూచినవారికి భయ
ముగల్గేటట్లుగ జేయును అటులనే అల్పులు మాకే సర్వము తెలుసునని వాదిం-
తురు అదియెట్లనగా ఖంగుమని కంచు మ్రోగినరీతిగా బలుకుచుందురని త-
రువాత॥

చ॥ తెలివి యొకింత లేనియెడ § దృప్తుడనై కరిభంగి సర్వము।
దెలిసితినందు గర్వితమతిన్ § విహరించితి తొల్లి యిప్పుడు।
జ్వలమతులైన పండితుల § సంగతినించుక బోధశాలినై।
తెలియనివాడనై మెలగి § తిన్ గతమయ్యెని తాంతగర్వముల్॥

తా॥ కొంచెమైనను తెలివిలేనివాడనై యుండియు నేనే సర్వము తె-
లిసిన మహాపండితుడనని గర్వించి చిన్నపెద్దల నెరుగక మదపుటేనుగువలె నె-
దురులేక పూర్వము దిరుగుచుండితినిగాని యిప్పుడు మహానుభావులగు పండితు-
ల సహవాసమువలన కొంచమంత తెలిసినవాడనై ఇప్పుడు యేమియును తెలి-
యనివాడనై యుంటిని అట్టి మహాగర్వమంతయు పోయినదని భర్తృహ-
రి ప్రమాణానుసారము తెలియనిపామరులు తెలుసునని వాదించుట వారికి
స్వభావమే యనిన విని॥

శిష్యుడు:— అయ్యా, యీ దూషించేవారందరు శ్రీవైష్ణవులందు
పెద్దలసాంగత్యములో యున్నవారుగదా గురువు పూర్వము గురుశిష్యుల

లోకరహస్యస్థలమున కూర్చుండి వేదాంతసంగతులు కొన్ని బోధించి తరువాత శిష్యుని నీమనస్సు కేమైనపట్టినదాయని గురుండడుగగ స్వామీ అంతపట్టినదిగాని లోకమాత్రముపట్టలేదని చెప్పినట్లుగా అనగా పిల్లి నెలుకనుపట్టి భ్రమింగుచుండగా శిష్యుడు గురువులవారు జెప్పుచున్నమార్గమువదలి పిల్లియందేమనస్సునుంచినట్లుగ కొందరికి వేదాంతమార్గము తెలియదు తెలిసినవారు బోధించుటయే లేదు బోధించినను శిష్యులు పిల్లినోటిలో నెలుకనంతబట్టినది లోకబట్టలేదని జెప్పినరీతిగ గ్రహించుటయే లేక వుభయులునొకటిగానేయుండి మేమేగొప్పవారమనిఅందుచు తెలిసినమహానుభావులెప్పుడైన మాకేసర్వము తెలుసునని కలలోసహితముఅనరు అనగా పొరపాటునైన పరులతోజెప్పరనిభావము॥

శిష్యుడు:—అయ్యా, ,,శ్లో॥ శిష్యపాపం గురుర్వ్రజేత్తు,, అనువ్యాయానుసారము శిష్యునికడతేర్చనియెడల శిష్యునిపాపముగురువునిజెందునని శాస్త్రములుబోధించుచుండగ అజ్ఞానములోనుండుటకుకారణమేమనగా॥

గురుడు. చ॥ మసగొని రేగుబండ్లకును § ముత్తెకముల్ వెలబోసినట్లుదు।
ర్వ్యసనముజెందికావ్యముదు § రాత్ములకిచ్చితిమోసమయ్యెనా॥
అను న్యాయానుసారము.

తా॥ అహంకారమమకారముల కూడుకొనియున్నవారల యిండ్లచుట్టునుదిరిగి యుపదేశములు జేయుట మొదటితప్పిదము, రెండవది తమరు కోరినట్లుగాధనమివ్వనందున వారువీరుదిట్టుకొనుట, మూడు వారినివిడచిపెట్టుటనాలుగు, నింతతోమానుకొనక నింకాకొందరినిభ్రమపెట్టి అశాశ్వతమైనడబ్బుకొసము అనగా రేగుబండ్లకు ముత్యాలు వెలబోసికొన్నతీరుగా వేదాంతరహస్యము పామరులకిచ్చి మహాపాపులగుటకు యెంతమాత్రమునుసందేహములేదనగవిని మరలశిష్యుండిట్లనియె॥

శిష్యుడు:— ,,శిష్యపాపంగురుర్వ్రజేత్తు,, అనున్యాయముగ వుపదేశముజేసినశిష్యునివిడచిపెట్టితె నింకదోషముగురువునకువచ్చునా॥

గురుడు:— వుపదేశమనగ సామాన్యముకాదు నాలుగు విధముల శిష్యునికడతేర్చవలయును. అవ్వియేమిటియనిన ౧ మొదటశిష్యుడు తనప్రజ్ఞావిశేషమువలన సత్యవంతుడైనగురుని వెదకి బహుగోజులు శుశ్రూషలు జేయుటే మర్కటగురుశిష్యన్యాయము. ౨ రెండవది మార్జాలగురుశిష్యన్యాయము

మనగ పిల్లి తనబిడ్డలయేడింద్లుద్రిప్పి మేతబెట్టి పాలియిచ్చిసాకినట్లుగ గురుడుశిష్యునకు జపముగాని తపముగాని వేదాంతశాస్త్రములు చదివించికాని శిష్యునికామక్రోధములునణగించవలె. మూడు ౩ భ్రమరకీటక న్యాయము వల్ల అనగా తుమ్మెద నొకపురుగును దెచ్చి ఓంకారశబ్దమువల్లతనరూపము జేయవలెనని ఝంకారసముచేత జేసినరీతిగా శిష్యునకు మహావాక్యములు బోధించి ఆరూఢునిగా జేయవలెను. ౪ తరువాతగోవత్సంగ గురుశిష్య న్యాయమనగా, తల్లినిపిల్ల పిల్లనుతల్లి విడువనట్లుగా గురుశిష్యులు నెకకూడనె కూడవున్ననుసరేవే అట్టివారుకడతేరుదురు.

అట్టిశిష్యుడేవిడచిపెట్టిపోతే గురువునకుదోషమేమి.

గీ॥ నొకకూప్రణవాక్షరంబైన ౬ నొసగినట్టి।
గురునికదలువకయున్నను ౬ కువలయమున।
నూరుజన్మంబులునశున ౬ కయ్యోనులనుబుట్టి।
కడకుచండాలుడైపుట్టు ౬ కమలనాభ॥

శ్లో॥ గురుత్యాగిమహారోగి మంత్రత్యాగి దరిద్రకః।
గురుమంత్రం ద్వయంత్యాగి రౌరవం నరకంవ్రజేత్॥

అను న్యాయానుసారము.

శిష్యుడేవిడచినయెడల యిన్నికష్టములు నతడే అనుభవించునుకాని మొదటశిష్యుని పరీక్ష జేయకుండా నుపదేశము యిచ్చినందున శిష్యునిపాపము గురువునకు జెందకమానదు యెందువల్లననిన దేహముకాలినప్పుడుమాని నప్పటికిని మచ్చపోనట్లుగా మొదట రేగుపండ్లకు ముత్యాలువెలబోసినట్టుగ తారతమ్యమువిచారించక నుపదేశముజేసినందున దోషమంటకమానదు అందువల్లనె ,,శిష్యపాపంగురుంవ్రజేత్,, నిశాస్త్రములు పెద్దలుచెప్పుదురు।

శిష్యుడు:— గురుస్వామి నుపదేశముజేసినందున లాభమేమి॥

గు. శ్లో॥ పరవుపకారం ప్రభవంతుగావ పరవుపకారంప్రభవంతువృక్షః।
పరవుపకారంప్రభవంతునద్యా పరవుపకారంయిదంశరీరమ్॥

తా॥ పశువులు, వృక్షములు, నదులు, సమస్తజీవులకు నుపకారముజేసినట్లుగా మనుష్యులు తనశరీరమువున్నంతవరకు ,,శ్లో॥ స్వయంతీర్ణంపరంతారం,, అనుస్మృతి, యీతవచ్చినవాడు యేరులు దాటించినట్లుగా సంసారసాగరములోబడి మునిగిపోవుచు కడతేరకుండ

[illegible]గురుని వెదకుచున్న వారికి వుపదేశము జేసినందున బంగారమునకు పరిమళంబుగలుగురీతిగ ముత్యపుచిప్పలోపడిన స్వాతిబిందువు ముత్యమైనలాగున సచ్చిదానందస్వరూపుండైన పరబ్రహ్మమును జేరును నందువల్ల గురుశిష్యులకులాభ మేయని జెప్పగా వినియు తరువాతను॥

శిష్యుడు:— అయ్యా సామాన్యగురువులు.

క॥ గురువటనెవరికిగురువా। హరిహరి తా దెలియలేక నాతనుగురుడా।
గురువనగాశిగ్గుగాద॥

అనువ్యాఖ్యానుసారము. వుపదేశములు జేసినందున వారికిలాభ మేమి॥

గురుడు:— సామాన్యగురువులు వుపదేశము జేసినందున వారికియిహమందు పైనగూర్చుండబెట్టి మంచిగా అన్నము బెట్టుదురు, పరమందుతానుసంపాదించుకున్న దోషమునకుతోడుగ శిష్యునిపాపము తనకువచ్చినందునయిబ్బడిలాభముకాద అన్లైతేవీనుకడతేరుటున్నదు అందువల్లనేసామాన్యగురువులకుజన్మదప్పదని శాస్త్రములుబలుకుచున్నవనెను॥

శిష్యుడు:— యీసామాన్యులు వారిలోవారుమెచ్చుకుందు రెందువల్లననిన॥ (గురుండు)

గీ॥ యోగినోగిమెచ్చు ౯ యోనరంగసుజ్ఞాని।
భావమిచ్చమెచ్చు ౯ పరమయోగి।
పందిబురదమెచ్చు ౯ పన్నీరు మెచ్చునా।
విశ్వదాభిరామ ౯ వినుర వేమ॥

కీర్తన॥ సజ్జనుసజ్జన్నిలేతో- చందన్మెకర్పూరు-
దుర్జనుడుర్జన్నిలేతో- భాంగుమెదుత్తూరు॥

అనువ్యాఖ్యానుసారము, పామరులు పామరులను మెచ్చుకుందురుగాని మంచివారినిమెచ్చరు యెందువల్లననిన మంచిగంధమునుమెచ్చకబురదనుమెచ్చినపందిగున్నతీరుగ మంచివారినిదుర్మార్గులు నిందించుటస్వభావము॥

శ్లో॥ ప్రారబ్ధంభోగతోనశ్యే తత్వజ్ఞానేనసంచితం।
ఆగామిద్వివిధంప్రోక్తం తద్వేషిప్రియవాదినే॥

తా॥ అనేకజన్మములయందు చేయబడిన కర్మములో తాను జన్మమునకుతెచ్చుకున్న ప్రారబ్ధం అనుభవించి తీరును జ్ఞానమువలన సంచితము [illegible]

# గురుశిష్యసంవాదము - జ్ఞానబోధ.

విఘ్నాః। యత్సారభూతం తదుపాసితవ్యం। హంసోయథాక్షీ రమి వాంబుమిశ్రం॥

తా॥ శాస్త్రములనంతము తెలిసికొని రహస్యములు పెక్కులుగలవు తెలిసినంతవరకు చదువుదామంటె మనుష్యుని నాయువ స్వల్పము యిందు లో అనేకవిఘ్నములు రాకమానవుగనుక అర్థము తెలియనిచదువువ్యర్థముగ చదివిచదివి తుదకుసన్యాసమైనచచ్చిపోవునుగనుక మిక్కిలి సారాంశముగల వేదాంతగ్రంధములుచదువుకొని నందుసారాంశముఅనగా నాల్గువేదముల కుమారుగా నాల్గుమహావాక్యములుజెప్పినారు అందులగలసారము నీళ్లును పాలును వేరుపరచినహంసమురీతిగా నాత్మానాత్మల విభాగించి తరించు మన్నారుగాని శాస్త్రములుచదువగూడదు వినకూడదనిచెప్పినవారుకారు మతము అన్నందుకు దుర్మతములువిడచిపెట్టి సన్మతములలో యిదిమంచిది గాదు అదిమంచిదనితిరిగిచెడక తనకుసమాధానమైనమతమును నంగీకరించి తదేకనిష్ఠగలిగి భగవన్నామము స్మరణగాని జపముగాని వేదాంతవిచార ణగానిజేయుచు కడతేరుమనిజెప్పినారుగాని చదువుకోవద్దుశాస్త్రములు చదువకూడదని అన్నవారుకారు తెలివిహీనులు వేమన్నగారు జెప్పినారని వారియందునొక సేరము బెట్టి తిండిసుఖమునబడి పెద్దలయందు దపోహములు గావించి చెడుచురుగాని యిట్టివారెన్నటికి బాగుపడరు॥

శిష్యుడు॥ అయ్యా వీరందరు మేము బ్రహ్మమును జూచినాము మీకు చూపించెదమందురు నిజముగాజూచినవారా లేక పరులభ్రమపెట్టెదరయీ సంశయంబు నిస్సంశయముగ దెలిపి నన్నుకృతార్థునిగా జేయుమనగా॥

గురుడు॥ ఛాత్రవర్యా వినుమనియే- వీరందరుబ్రహ్మమునుమేము జూ చినామనిఅన్నందుకు నొకసామెతకలదు. పూర్వమందుగ్రుడ్డివాండ్లందరు యేనుగను నొకశ్రీమంతుడుజూపించగ-వారందరు నొక తొండము కాళ్లు చెవులు వీపు అవయవంగములు తలానొకటి బట్టుకొని చూచితిమని సంతో షపడుచు నిజస్థానమునకువిడచిపెట్టి ఆమహానుభావుడు వెళ్ళిపోయిన తరు వాత యీగ్రుడ్డివాండ్లందరు యేనుంగువు నొక-చూచినవాడు పాముగా వున్నదనియు తొండముజూచినవాడు లావుగా వున్నదనియు చెవులుజూచిన వాడు చేటవలెగావున్నదనియు యీప్రకారముగ నొకరిమాటనొకరికి పొ రింతక అనేకముగా తిట్టుకున్నతరువాత యిందులో నొకరైనను యేనుగను

శాంతముగా చూడనందునగదా ఆవీరుగాను సర్వజ్ఞులైన మహాపురుషులు అనుకోగా విన్నమాటలవల్ల బ్రహ్మమునుజూచినామందురు నిజముగాజూచినందుకు అనుభవమెదుష్ప్రాంతిముకాబట్టి కొంచమైన జ్ఞానము లేనందున అనుభోజ్ఞులుకారు వీరలువాచాళులు అనిపరిగణింపబడుచున్నారు॥

శిష్యుడు॥ అయ్యా యటువంటివారికి పరబ్రహ్మదరిశనమౌను॥

గురుండు- శిష్యవర్యా వినుమనిరె॥

గీ॥ ఆశకోసివేసిక్ష యనలంబుజల్లార్చి। గోచిబిగియబట్టికోపమణచి।
గుట్టుమీదివాడుగురువులగురువురా। విశ్వదాభిరామవినరవేమ॥

గీ॥ కుకలనుదిన్నవాడుగురులింగజంగంబు।పందినితిన్నవాడుపరమయోగి।
యెనుగనుతిన్నవాడునెంతసుజ్ఞానియు। విశ్వదాభిరామవినరవేమ॥

తా॥ అష్టమదములు ఆశాపాశములుఅహంకార మమకారములును మరిషడ్వర్గములువదలి మాకే తెలుసునని పిన్న పెద్దలహంకరించక తపేకనిష్టతో ప్రపంచమునుమరచి చాలోన్మత్తపిశాచివలె దేహమునుమరచినఅగాధయరుకమరువుల బొరయకయున్నవారికే పరబ్రహ్మదరిశనముగాని తదితరులకు తలక్రిందుగబడినప్పటికి అనేకజన్మములకైనను పరమాత్మునిదరిశనముకాదని తెలియవలెను॥

శిష్యుడు॥ స్వామి మధుమాంససంగమంబులుజరిగించవచ్చును మనుష్యులుదినుటకే బ్రహ్మజీవుల సృష్టించినాడని కొందరందురు॥

గురుడు-ఛాత్రవర్యా॥ ,,అహింసపరమోధర్మమః,, శ్రుతిప్రమాణము తప్పివర్తించుటనొకదోషము బ్రహ్మదేవుడేఆజీవుల తినమనిపుట్టించినాడనుటరెండు భూతదయలేకచంపుటవల్ల మూడు జిహ్వాచాపల్యమువలన దినవచ్చుననుట నాలుగుదోషములు గలవు॥

శిష్యుడు॥ అయ్యాచంపకుండ తాను పరులుచంపినమాంసము తినుటవల్ల దోషములేదుకొందరందురు॥

గురుడు॥ చంపినవారికి నొకవాలు తిన్నవారికి నెనిమిదిపాళ్ళపాపమని త్రివర్గదీపికయనుగ్రంధములో జెప్పినధర్మమునుబట్టి కబీరుదాసు మహాత్మదిప్యమతమును ఖండించెను అదియునుంగాక శరభ శార్దూలములులోనగుసింహ ఘోరమృగములు మనుష్యులతినుటకేబ్రహ్మవాటిని సృష్టించినాడు, గ్రామముగాని తనవాడుగాని ఆహారమిచ్చెదర॥

శిష్యుడు- అయ్యా నెవరైనాతనచావుకు వొప్పుకునేవారుండార॥

గురుడు॥ తనప్రాణమువంటిది యదటిప్రాణముగాద సర్వభూతద యలేనిదుర్మార్గులు శతసహస్ర జన్మములకైనను కడతేరుటలేదని శాస్త్ర సిద్ధాంతము॥

పరస్త్రీసంగమునకు.

గీ॥ కచ్చమీదియ–శక్తకనకంబుమీదాశ। లేనివాడుపృధివిన్లేనివాడు॥

అనున్యాయానుసారము గుహ్యచాపల్యమువల్ల జరిగించెదరుగాని॥

శ్లో॥ దాసీమానధనంహంతి। హంతివేశ్యాధనాధికం।
ఆయుక్షీణవిధవాహంతి। సర్వంహంతిపరాంగనా॥

తా॥ దాసీసంగమము మానముబోగొట్టును వేశ్యాసంగమము ధనము నుబోగొట్టును విధవాసంగమము ఆయుష్యముబోగొట్టును పరస్త్రీసంగమ మువియన్నియుబోగొట్టును అనుశాస్త్రానుసారముగా ధనమానా యుష్య ములు పోయినతరువాత బ్రతుకులుకంటె చచ్చినదేమేలు॥

శిష్యుడు:— పరస్త్రీ కోరివప్పుడు కోరిక తీర్చకపోతే దోషమని కొందరందురు॥

గురుడు:— చండాలస్త్రీలుకోరినప్పుడుగాని గురుబ్రాహ్మణరాజ సతులుగాని అక్క–చెల్లె తల్లి గాని వీరందరికోర్కెలుదీర్చుతారుగదా॥

శిష్యుడు:— అయ్యా వీరుమాతృసమానులుగనుక వీరితోపోగూడ దు చండాలస్త్రీలను తాకకూడనప్పుడు వాండ్లతోసంగమముజేసిన దోష ముకాదా గురుడు దోషములేనివారెవరు సామాన్యస్త్రీలకు చెప్పినమాట లుగాని గొప్పవారికిజెప్పినవిగావు అనిశిష్యుడనగ॥

గురుడు:— సామాన్యులకోర్కెలుదీర్చునతడు తనభార్య పరులు కోరినప్పుడు పరులకోర్కెలు తీర్చవచ్చునుగదా॥

శిష్యుడు:— యింత తెలివిహీనుడైన భార్యనుకోరినప్పుడు అఖండ మైనకోపముచేత కొట్టుకొనిచావర॥

గురుడు:— పరస్త్రీలభర్తలకు రోషములేదాయేమి॥

శిష్యుడు:— రోషములేనివాడున్నాడా॥

గురుడు:— వారుకొట్టిచంపర అందువల్లనె పరులకోర్కెలుదీర్చ వలసిన పోయినచంద్రునికూడ దోషమనుభవించకతప్ప లేదుగద అహల్యను

కోరిన దేవేంద్రునకుగూడ శాపముతప్పలేదుగద రావణుండుపరస్త్రీనికో రినందున చచ్చిపోయినాడుగద యీప్రకారముగ అనేకమంది స్త్రీనిమిత్తమై బంధనుపొంద వచ్చినప్పటికిని పరస్త్రీగమనము పాపముగనుక పరలోకమున కుప్రాప్తులై చెడిపోయెదరుగాన ఎప్పటికిని పరస్త్రీనితల్లిగా భావించువా డెగడతేరును అనగాసద్గతి గల్గుననిభావము॥

శిష్యుడు:— స్వామీ కాయలు, పండ్లు, ధాన్యము తినుటవల్ల జీవ హింసకాదా యని కొందరందురు. (గురుడు) భక్తవర్యా. శ్రు॥సర్వంఖ ల్విదంబ్రహ్మం అన్నాద్భూతానిభవతి, అను న్యాయానుసారము ధాన్య ము, కాయలు, కూరలు, సస్యములు వగైరాసృష్టించి తరువాతనునరజం గపశుపక్ష్యాములబుట్టించెను అందువల్ల ధాన్యాదుల భక్షించినందున జీవ హింసకాదు నివి దినుటవల్ల దోషములేదని చెప్పినది వేదములేకనుశ్రుతిప్ర మాణముగ నడుచుకొనుటధర్మమేకదా యనినగురునకుశిష్యుండిట్లనియె,

ఆర్యవర్యా, కల్లుత్రాగకూడదనుటకు వృక్షమునందుగల్గిన పండ్లవి నుటయూల రసముత్రాగినందునదోషమేమి యీసంశయముదీర్చుమనిప్రార్థింప గా గురుండిట్లనియె. (ఛాత్రవర్యా)

గీ॥ కల్లుద్రాగుటగురుపత్ని § గవయుటయును।
విప్రుజంపుటబ్రహ్మస్వ § విషయమైన।
ముచ్చిమియునివిగలిగిన § క్రూరమతుల।
బ్రతికలయుటయునుమహా § పాతకములు॥

తా॥ కల్లుద్రాగుటయు గురుభార్యాగమనము బ్రాహ్మణుని జం పుటయు బ్రాహ్మణునిసొమ్ము టొంగిలించుటయును యీనలుగురితొకలస హవాసము చేయుటయు నీదైదును పంచమహాపాతకములని భారశాస్త్ర గ్రంథములలో చెప్పియున్నటగనుక మద్యపానము జేయుకూడదని సత్పురుషు లచేనిషేధింపబడినది యిదియునుంగాక. మధుపానమునందు చిత్తవైకల్య మును భూమిమీదనొరిగిపడుటయు అయుక్తముగాబలుకుటయు లోనగు స ప్తపాతలక్షణములుగలిగియుండును. మరియును లోకసాధుసజ్జనుడు యాని వార్యకార్యముచేత గ్రామాంతరమునకుపోవుచుండెను అంతట మార్గాయాస మునచే మద్యము విక్రయించు [illegible] యందువలన [illegible] గ్రామమునకు [illegible] ప్రాణహానము [illegible]

ఉండగా నంతటభగవంతుడు ఇతడు మనోవాక్కాయములయందెల్లప్పుడు సద్వృత్తిగలిగియుండుటచే సాధుశిఖామణియని లోకులందరును గొనియాడుచున్నారుగాన వీనిమనశ్శుద్ధికొంతపరీక్షింపవలెనని యెంచి యామార్గమునకుసమీపమున భగవంతుడు నాలుగుద్వారములుగలమేడ నొకదానిగల్పించెను అంతటనాసాధువామేడనుజూచి దాహమిచ్చుటదొరుకవచ్చునని తలచి యామేడకడకుబోయెను అప్పుడు ఆమేడమొదటిద్వారమందొక మనుజుడుకత్తిబట్టుకొనినిలచియుండగాచూచి కొంచముదాహమిప్పించుమనివేడుకొనెను అప్పుడామనుష్యుడు ఈకత్తితోనీబాలునిఖండించినయెడల నీకుదాహమిప్పించెదనని చెప్పగా నాసాధువువిని (అహింసాపరమోధర్మ) మన్న శ్రుత్యర్థానుసారముగా వర్తించువాడు గనుక దప్పిచే ప్రాణముపోయినను మంచిదేకాని యిట్టి ఘోరకృత్యము జేయగూడదనితలచి తిన్నగా రెండవద్వారమునకుబోయెను. అంతనక్కడనున్న పురుషునిజూచి కొంచముదాహమిప్పించుమని యడుగగా నతడు ఇదుగోయీపశుమాంసము భక్షించినట్టయిననీకుదాహమిప్పించెదనని ప్రత్యుత్తరమిచ్చెను అప్పుడాసాధువదివిని మాంసముతిన్నవానికి యెనిమిదిపాళ్ళు పాపమనియెంచి మూడవద్వారమునకుబోయి యక్కడనున్న మనుజుని దాహమిప్పించుమనియడిగెను అంతనా మనుజుడు ఈయువతితోసంభోగించినపక్షమున దాహమిప్పించెదనని చెప్పగా విని నాసాధువులికిపడి పరస్త్రీనితల్లివలెను పరద్రవ్యముమంటిగడ్డవలెను సర్వప్రాణులతనవలెనుజూచువాడు జ్ఞానియనితలచి నాలుగవ ద్వారమునకుబోయి యచ్చటనున్న పురుషునిజూచి కొంచముదాహమిప్పించుమని ప్రార్థించెను అంతటనాపురుషుడు ఈమద్యముకొంచము ముందుగా పానముజేసినట్టయిన తత్క్షణమేదాహమిప్పించుచున్నానని పలికెను అదివిని సాధువత్యధికమైనబాధకోరువలేక నీమద్యముద్రావినందువలన ప్రత్యుతముగలుగునట్టిబాధకమేమున్నది పరద్రోహముజేసి తేగదా పాపముసంభవింపవలెనదనియాలోచించి మొదటకొంచముద్రావెను అంతటనామద్యమువల్ల నుత్సాహమెక్కువయి పూర్తిగామధుపానమాచరించెను అంతటనామద్యపానమదమెక్కు మత్తుతలకెక్కి మొదటిద్వారమునకుతిరిగివచ్చి (మదిరాపాన మదాంధుడాత్మపటము § న్నయినుండినక జారినక । వదలై వ్రేలినజాడదప్పగిది) యను శాస్త్ర) కృత్యకారము నొడలెరుగక అక్కడుండియున్నకత్తితో నాబాలు

నినరికివేసెను తరువాత రెండవద్వారమునకువచ్చి మద్యపానులకుమాంసా పేక్షగలిగియుండుటసహజమేకాన అక్కడనున్న పశుమాంసము నిరాటంక ముగాభక్షించెను తదుపరి తృతీయద్వారమునకుబోయి (శ్లో॥ మాతరమపి కామయతే సావజ్ఞంమద్యపానమత్తస్సన్) అనుశాస్త్రోక్తప్రకారము మ ద్యపానులు మాతృద్రోహమైనా జేతురుగనుక నాయావతితో స్వేచ్ఛగా భోగించెను అంతటమద్యపానమువలని మత్తుదిగిపోయినందువలన తానాచ రించినయకృత్యములనుదలచి ఆహా యిట్టిపాపములు జేసినమీదట జీవముతో నున్నందున నేమిఫలమని తక్షణమే ప్రాణత్యాగముజేసికొనెను గానమద్య పానముకలనహాసిదెచ్చును నందువల్ల ద్రాగవద్దనిజెప్పితిని త్రాగినవాడుపం చమహాపాతకులలో వాడనిజెప్పగావినితరువాత॥

శిష్యుడు:— అయ్యా గురుస్వామీ జననమరణంబులు పుణ్యాపాపం బులు స్వర్గనరకంబులు లేవనివాదించుచుండగ తమరుపంచమహాపాతకము నికలవిచ్చుట నాకుగొప్పసందేహముగాయున్నది గాన యీసంశయముని స్సంశయముగాజేసి నన్నురక్షించుమనిప్రార్థింపగా గురుండిట్లనియె.

గురువు॥ జన్మమిప్పుడుయెట్లవచ్చినది.

శిష్యుడు॥ మాకు తెలియదందురు.

గురువు॥ యీజన్మమొచ్చినది దెలియనప్పుడు ముందుజన్మలేదని వారికె ట్లా తెలుసును.

శిష్యుడు॥ కొందరుయెట్లవచ్చినదో వొచ్చినదందురు.

గురువు॥ అట్లాగమళ్ళివొచ్చునని దెలియవలెను.

శిష్యుడు॥ మరికొందరు మాయకుస్వభావమందురు.

గురువు॥ యప్పటికినిఆమాయవల్లనేజన్మమొచ్చునని గ్రహింపవలయును.

శిష్యుడు॥ నింకాకొందరు జన్మమెత్తనేలేదందురు.

గురువు॥ అన్నిటికన్న యీప్రశ్నమరిబాగున్నది తానుండియును తనత ల్లిగోత్రాలనిచెప్పినట్లుగా పుత్రమిత్రకళత్రగేహారామ విత్తాదులునావనిని రంతరమునమ్మికొని ఆశామోహమనేత్రాటిచేకట్టుబడి పిశాచులవలె తిరు గుచు (మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయనమోనమో) అను న్యాయమ మెంతమాత్రమునులేక అనేకకృత్యములు జేయుచు సంసారము పోషించుచు సుఖాధవముమంటే మాయాభువాలు కొన్నివిట్టి వేదాంతములుచెప్పుకొనె గా

మాత్రముచేతనే బ్రహ్మజ్ఞానులు కారుగాని యీపిల్లవానిగతి వంటి వంచకు యిట్టిదుర్మార్గులు శతసహస్రజన్మములకైనకడతేరరు అనిచెప్పగావిని తరువాత గురుస్వాములకుప్రణమిల్లియు.

శిష్యుడు:— అయ్యా యిదిపుణ్యము యిదిపాపమని యాలోచించుటకుకారణమేమిటో తెలుపుండని ప్రార్థింపగా గురుండుపనుమనిరు.

శ్లో॥ పరోపకారఃపుణ్యాయ పాపాయపరపీడన॥

తా॥ యీప్రపంచములోనున్నప్రాణులకు జేయబడినయుపకారమంతయుపుణ్యము అపకారమంతయుపాపమని భీష్ములవారు ధర్మరాజునకుబోధించిన భారతోక్తప్రకారము॥

శ్లో॥ పూర్వదత్తేషుయావిద్యా పూర్వదత్తేషుయ నారీ పూర్వదత్తేషుయ
వ్వనం పూర్వదత్తేషు యద్ధనం॥

తా॥ తాను పూర్వజన్మమునందు జేయబడిన పుణ్యమువల్ల యీజన్మమందు సకలైశ్వర్యములు గలిగి సద్గుణదాంపత్యంబు దొరికినందునసకల సుఖము లనుభవించుటే పుణ్యమనరూపముపాపవనగా తానుపూర్వజన్మమందుజరిగించిన॥

శ్లో॥ గోహత్యాయుగంపాపం బ్రహ్మహత్యాయుగద్వయం।
స్త్రీహత్యాయుగత్రయం రుణాచేకదనాచతి॥
శతగావహంతావిప్ర శతవిప్రహంతాస్త్రియా।
శతస్త్రీనాంహంతాబాలా శతబాలహంతానృతం॥

తా॥ నొకగోవునుజంపితే నొకయుగము ననుభవించితే ఆపాపము దీరును బ్రాహ్మణునిజంపితే రెండుయుగములకుతీరును స్త్రీనిచంపితే మూడు యుగములకుపోవునుగాని బాకీనెగరగొట్టినదోషము యెన్నియుగాలు ననుభవించినను నొకజన్మానతీర్చుకోబడును నూరుఆవుల జంపినంతపాపము నొక సద్విప్రునిచంపినయెడల నంతదోషముకలుగును అటువంటిబ్రాహ్మణులనూరుమందినిజంపితేనెంతపాపము నొకగుణవతియైనస్త్రీనిజంపితే నంతపాపము అటువంటిపతివ్రతలనూరుమందినిజంపితే నెంతదోషము నొకపిల్లవానితెగటార్చితే నంతపాపము అటువంటిపసిబాలుర నూరుగురునిజంపితే నెంత పాపము నొకరుపర్యాయము బద్ధమాడితే నంతదోషమగునుకనే (యట్టిపాతకునైననేభరించెదగాని క సత్యహీనునిమోయజాలననుచు । భూకాంత

ర్లి ధరాదేవి బ్రహ్మతోడా) అనున్యాయానుసారము పూర్వమందు తానుజే సిన పాపకృత్యములవల్ల నీజన్మమందు దారిద్రము దుర్మార్గ దాంపత్యము నందువల్ల ననేకదుఃఖముల్ నింకాకుష్టు కుంటిమూగ అంధుడు వాతపైత్య శ్లేష్మాదులతో రాబడిన మూడువందలరువై రోగములవల్ల కష్టపడుటయే పాపమునకు రూపము యీ పాపపుణ్యమనుభవజ్ఞులె పూర్వజన్మమున్నదనుటకు సాక్షులు వీరికష్టములుజూచి అయ్యో పాపమనిఅంటె వారుజెప్పునదియేమ నగా మేముపూర్వజన్మమందు జేసినకర్మననుభవించకతీరదనిఅందురుగనుక సుఖమంతపుణ్యముకష్టమంతపాపము పాపమువల్ల (దారిద్రంబంతదుఃఖంబే టోయి జగతిలోనుఈశ్వరుడెరుగుగా) అను న్యాయానుసారము మూడుజ న్మాలదారిద్రుడువచ్చినాడు భిక్షము బెట్టుమని జెప్పినరీతిగా॥

గీ॥ కలిమినాడుజేయు కానడుమదమునా। లేమినాడు జేయ తనకులేదు।
కలిమిలేమిలేని కాలంబువచ్చునా। విశ్వదాభిరామ వినరవేమా॥

తా॥ ధనము వున్నప్పుడు ధనవంతుడు పోరుగానలేడను న్యాయానుసారముగ ధర్మముజేయనొల్లడు లేమిఅనగా దారిద్రమున జేయుటకు తనకేలేదు(పునర్దరిద్రః పునరేవ పాపి)అనునట్టి పాపమువల్ల (పునరపిజననంపునరపిమరణం) అనున్యాయానుసారముగ అనేకజన్మములకైన కడతేరరనువేదాంతవాక్యమును జెప్పగావిని॥

శిష్యుడు:— ఆర్యవర్యా కొందరుసోహమేబ్రహ్మమందురు నిజముగానమ్మవచ్చునా॥

గురుడు:— శిష్యవర్యా? సోహమేబ్రహ్మమన్నందుకు కొన్నిదోషములుకనుపడుచున్నవిఅవియెట్టివనిన ౧-ద్వాదశాంగుళం ౨-పలుకు-౩-చలనము ౪-క్షీణించుట ౫- వృద్ధి ౬- వశము ౭- పూరించుట ౮- రేచించుట - యిన్నివిధములుగలిగియున్న సోహమ్మెబ్రహ్మమనగూడదుగాని - అజపమువల్ల- అనగా యిరువదియొక్క వేయ్యారునూర్లజపము ప్రతిమనుజునకు రోజువకటింటికిజరుగుటవలన మనుష్యులకునాయువగతించును యీస్వాసనునిల్పినయోగులకునాయువపెంచును అందువల్ల నైనూరుమున్నూరు వత్సరంబులయినయుగమైన ఆయువపెంచును యింతకన్న విశేషమేమియును లేదుగాని నిజముగా యీతత్వము విచారించిన మహానుభావులకు అనగాపూర్ణానుభవములుగల సజ్జనులకు కొన్ని శుభాశుభములు తెలియును మరణకాలము తెలి

యవచ్చును రేచక పూరక కుంభకములయందుకొంత ఆనందము కలుగును యీచెప్పబడినదంతయు యరుకమరువులు అనగా పాలునీళ్లు కలిసినరీతిగా యున్నందున పరిపూర్ణబ్రహ్మమని జెప్పకూడదు యీసమాచారము పామరులకు తెలియక యీసోహమేబ్రహ్మమని నిశ్చయముగావాదించెదరు. తాజడ్డకోతివనమెల్ల చరచినట్లుగ శిష్యులకునిదేప్రకారముబోధింతురు ,,యోద్భావంతద్భవతి,, అనున్యాయానుసారము గురువునకెంతో శిష్యునకంతే యీప్రకారముగ అనేకమంది ననేకవిధములభావించి వేదాంతమార్గమును నిజముగావిచారింపనేరక బహుమందిగురువులమని మాకేతెలుసునని మంచివారలనిందించుచు సామాన్యులకు నీప్రకారముగభ్రమబెట్టి ఉపదేశములుచేసి ధనముసంపాదించుటకు ప్రయత్నములుజేసేమానవాధములమాటలు నెప్పటికైనవనమ్మకూడదనిబోధించిన సద్బోధవిని మరల యిట్లని ప్రార్థించిన శిష్యునిజూచి గురుండు॥

శిష్యుడు:— అయ్యా, యీచెప్పబడిన గురుశిష్యులు వారందరు సర్వజ్ఞులైనమహాభావులవద్ద పరిపూర్ణభావము గ్రహింపవచ్చునాయనిన, గురుండు. గ్రహింపవచ్చునుగాని వీరలందరికి పదమూడువిధములైన అభిమానగ్రస్థులైయున్నవారలు అవ్వియట్టివనిన శిష్యునకు గురుడు దెలుప నారంభించెను॥

రాగమనగ పరస్త్రీలయందుభ్రమబెట్టుకొని రావణుండు శ్రీరాములచేతచచ్చిపాయెను దీనకుసకజన్మమువచ్చును॥

ద్వేషమనగ పరులకు అపకారముజేసినహిరణ్యాక్షుడు యజ్ఞవరాహముచేతచచ్చిపోయెను దీనపాము జన్మమువచ్చును॥

కామమనగ మిక్కిలిధనము రాజసము శౌర్యముసంపాదించ పరులనుబాధపెట్టిన జరాసంధుడు భీమునిచేతమృతించెను దీనివల్ల పిల్లి జన్మము వచ్చును॥

క్రోధమనగ తనకుసరివారులేరనియు తానేపరమాత్ముడనియు ఓం నమోహిరణ్యకశ్యపాయ అని జపింపించుకున్న కనకాక్షుడు నరసింహునిచే తహతుడయ్యెను దీనకోడిజన్మమువచ్చును॥

లోభమనగ తనరాజ్యము ధర్మరాజునకు సఖభాగమునివ్వనందున పాలివారిసొమ్మునదిని పాడైపోదురను న్యాయానుసారముగ భీమునిచేత దు

క్రోధమునందుమడిసెను దీనివల్ల యీగలైపుట్టును॥

మోహమనగ లేడిపిల్లయందు అపేక్షపెట్టుకున్న జడభరతుడుతపస్సంపన్నుడుగనుక మూడుజన్మములకు మోక్షమునకుబోయినాడు సామాన్యులనేకజన్మములతోనుందురుగనుక అట్టివారి కనేకజన్మములకైనకడతేరుట దుర్లభం దీనివల్ల కప్పజన్మమువచ్చును॥

మదమనగ నేనునేమిజేసినను చెల్లునని దేవతలకు నలవిగాకుండ తిరిగిన మేఘనాధుడు లక్ష్మణమూర్తిచేత హతుడయ్యెను, దీనివలన సూరపందియైపుట్టును॥

మాత్సర్యమనగ తనకన్నదధికుండుండవచ్చునాయని దూషించిన శిశుపాలుడు శ్రీకృష్ణునిచేతనశించెను దీననక్క జన్మమువచ్చును॥

ఈర్ష్యయనగ తనతోపాటుగ అందరికి సుఖమురావచ్చునాయని సాధించినకంసుండు బలరామకృష్ణులచేత తెగిపోయెను దీనకోతియైపుట్టును॥

అసూయ అనగ తనతోసమానుగ పేరుబెట్టుకొనవచ్చునాయని సధికగర్వముచేత కృష్ణమూర్తిని నీపేరుతీసి మారుపేరుబెట్టుకొమ్మనిదూతనుబంపిన పౌండ్రక వాసుదేవుడు శ్రీకృష్ణునిచేత శమనపురికేగెను దీనివలన పెద్దపులియైపుట్టును॥

డంభమనగ తానుజేసిన సత్కార్యములు అందరువిని తననుమెచ్చవలయునని పరులకుగొప్పగాజెప్పుచుండెడి వారలనేకమందిగలరుగాన దీని మహిషజన్మమువచ్చును॥

దర్పమనగ తానుదొడ్డవాడనియు తనకే సర్వముతెలుసునని పరులతోవాదించి తుదకుగెల్వలేక బెదరించె సామాన్యగురువు లనేకమందిగలరుగాన దీనివలన సాళువపక్షియైపుట్టును॥

అహంకారమనగ వోరినిన్నుశిక్షించెవాడనని యెరుగవా నేనుపట్టినకార్యమువిడుచునట్టివాడను గానని పరుల బెదరించెవచ్చి తవృత్తి దీనరాక్షసుడైజన్మించును యీపదమూడుగుణములలో యేగుణముగల్గియుండినను నరకవిముక్తిలేదనియును అథవాబహుకాలంబులకు నరకముతప్పినను ఆయాగుణానుకూలమైన జన్మములెత్తుదురని బుధులు వచింపుచుందురు యిప్పటి గురుశిష్యులకు బహుమందికి నివియుండుటవల్ల అనేకజన్మములకైనకడతేరరనిన అన్నోక్తిప్రకారముజెప్పితిననిన విని తరువాతను॥

శిష్యుడు:— అయ్యా శ్రీగురుస్వామి వీరలకు నెప్పటికైన మోక్షముగలుగునా॥

గురుడు:— అనేకజన్మములు గడచినతరువాత మనుష్య జన్మమువచ్చును ,,శ్లో॥ సత్యంబ్రహ్మతపోబ్రహ్మ బ్రహ్మచేంద్రియనిగ్రహం। సర్వభూతదయాబ్రహ్మ ఏతద్బ్రాహ్మణలక్షణం॥

తా॥ న్యాయాన్యాయము తెలుసుకోగల నరజన్మమందున భూతదయ ధర్మచింతనసన్మార్గములవల్ల బ్రాహ్మణుడైజన్మించును ,,శ్లో॥ శతంబ్రాహ్మణముఖ్యోభ్యో పరమేకోపివేదవిత్। వేదవిద్భ్యసహస్రేభ్యో పరమేకోవిజ్ఞానవిత్। జ్ఞానవిద్భ్యసహస్రేభ్యో పరమేకోపియోగవిత్। యోగవిద్భ్యసహస్రేభ్యో పరంవిష్ణుశ్చకింకరః॥

తా॥ సత్యవృత్తితోయున్న బ్రాహ్మణుడు నూరుజన్మములకు సర్వవేదములు తెలిసినవాడగును అట్టి వేదము తెలిసిన బ్రాహ్మణుండు వెయ్యిజన్మములకు జ్ఞానముగలవాడగును జ్ఞానము తెలిసిన బ్రాహ్మణుండు సహస్రజన్మములకు యోగియైజన్మించును అట్టిమహాయోగి వెయ్యిజన్మములకు నిజమైనవిష్ణుభక్తుడై భక్తిద్వారనిజమైనజ్ఞానియై మోక్షమునుబొందుననిశ్రుతులుబలుకుచుండగ మోక్షము వీరలకు దొరుకును అనగబొరుకుననిఅర్థము॥

శ్లో॥ దుర్లభంనరజన్మానాం సాధూనామతిదుర్లభం। దుర్లభంవిష్ణుభక్తానాం జ్ఞానీత్రైలోక్యదుర్లభమ్॥

తా॥ శరభశార్దూల పశుపక్ష్యాదిజన్మము లనేకము లెత్తగానెత్తగా కడపట బహుజన్మసుకృతవిశేషంబుల వలనగాని ధర్మాధర్మములనెరుగక సామర్థ్యంబుగల నరజన్మముగలుగదు కావున నరజన్మము దుర్లభమైనది మరియు నరజన్మములనేకము లెత్తి జేసిన పుణ్యపుంజంబువలన రాజసతామసగుణసంబంధమగు ఘోరమూఢవృత్తులులేక కేవలసత్వగుణప్రధానమగు శాంతవృత్తితోగూడిన సాధుత్వంబుగలుగునేకాని సాధుత్వముస్వతః ఘటింపదుగనుక సాధుత్వమతిదుర్లభమైనదియును అట్టిసత్వగుణప్రధానముగాగల్గిన శాంతవృత్తితో కూడిన జన్మసహస్రమువలన జేసిన పుణ్యపుంజపరిపాకంబువలన విష్ణుభక్తికలుగవలసినదేకాని దుర్మార్గవృత్తిచేత శతసహస్రజన్మములకైనకడతేరరు ,,జ్ఞానీత్రైలోక్యదుర్లభమ్.. అనువాక్యము యీమూడులోకములలో అట్టిమహాత్ములు [illegible]

# గురుశిష్యసంవాదము - జ్ఞానబోధ.

తము. యిదిస్మృతి శ్రుతీతిహాసపురాణముల జెప్పబడియున్నందున మోక్షము లేదని జెప్పకూడదు గనుక అటువంటివారికి మోక్షము కలదుఅని జెప్పగా విని తరువాత॥

శిష్యుడు:— అయ్యా, అటువంటి పూర్ణజ్ఞాని గృహస్థాశ్రమ మందు యెట్లా ప్రవర్తించును॥ (గురువు)

సీ॥ జలజపత్రమునందుసలిలమంటనియట్లు ॥ అద్దంబులోరూప మంటనట్లు।
చిత్రభానుందునుచీకటంటనియట్లు ॥ ఆకాశమునవాయువంటనట్లు।
భువిచింతపండుపైబొబ్బరంటనియట్లు ॥ అర్ఘంబు వాజిహ్వకంటనట్లు।
బురదయాకుమ్మరా పురుగుకంటనియట్లు॥బలుచల్లలో వెన్న గలియనట్లు।
బ్రహ్మవేత్తలుమాయా ప్రపంచమందు
నఖిలవ్యవహారములు జేసి నంటరధిప।
రమ్యగుణధామ భద్రాద్రి రామసత్య
కామకరుణాలలామ లోకాభిరామా॥

అనున్యాయానుసారము. తామరాకునందు నీళ్లుఅంటనట్లుగానున్న వాయువ సమస్తరంధ్రములలో ప్రవేశించి నప్పటికిని నెకడ చిక్కనట్లుగానున్న సూర్యునకుచీకటిఅంటనట్లుగానున్న అద్దములో మనుజునిరూప మంటనట్లుగానున్న చింతపండుకు బొబ్బరి అంటనట్లుగానున్న వెన్నచల్లలోగలియనట్లుగానున్న నెయ్యినాలుకకు అంటనట్లుగానున్న బురదకుమ్మరపురుగుకు అంటనివిధముగానున్న సర్వముభక్షించిన అగ్నిహోత్రుడు కల్మషములంటనివిధముగా రుతుకాలమున నిజభార్యతోకూడుకొనిఅస్ఖలిత బ్రహ్మచారియై బ్రహ్మవేత్తయై తానేబ్రహ్మమనిభావించుచు నిశ్చలమనస్కుడై కాలాంతమువరకు నొకతీరుగాప్రవర్తించి యెరుకమరుపులబోరయక బ్రహ్మమందు ఐక్యమగును నీళ్ళలోబుట్టినలవణము నీళ్ళలో కలిసిన రీతిగ మోక్షమునుజెందునని జెప్పగావిని తరువాతను॥

శిష్యుడు- గురుస్వామీ.




గీ॥ తోలుదాకలోను ॥ దొడ్డవాడుండగ,
కుంభాలుబోతురు ॥ గుళ్ళనమ్మ,
రాళ్లుదేవుడైతె ॥ రాసులుమ్రింగ,
విశ్వదాభిరామ ॥ వినర వేమా॥

అనుపదమునకు రాళ్ళు దేవుండ్లుగారనియును, రాళ్ళను పూజింపవ ద్దనియును బహుమంది వేమయ్యగారు జెప్పినారని విగ్రహములుపూజించు వారల నిందించెదరుగాన వేమయ్యగారు జెప్పిన అర్థమయి దేన నింకవేరు గానుండున యీసందేహమునిస్సందేహముగ బోధించి నన్ను కృతార్థునిగా జేయుమని ప్రార్థింపగ గురుండుయిట్లనియె. నీసూక్ష్మబుద్ధికిమెచ్చితనని చె లుపనారంభించెను. చాత్రవర్యావినుమనియె॥

వేమయ్యగారు జెప్పిన అంతరార్థమేమనగ నిరాకారమై నిర్వికా రమై నిరీహమై నిర్గుణమై నిర్ద్వంద్వమై నిర్వికల్పమై నిరాధారమై నిశ్చలమై నిష్ప్రపంచమై నిష్కామమై జ్ఞప్తియై జ్ఞానమై చైతన్యమై బోధమై ఆదిమ ధ్యాంతరహితమై అప్రమేయమై స్వప్రకాశమై స్వయంప్రకాశమై నిష్క ళంకమై నిష్క్రియయై నిరాధారమై సాక్షియై సర్వతోముఖమై విశ్వాకా రమై విశ్వంభరమై అనాదియై శివమై నిత్యమై సత్యమై అచలమై అచలాం తగార్థమై అచలపరిపూర్ణమై సిద్ధమై బుద్ధమై మోక్షమై సచ్చిదానంద మై సర్వముక్తానయై సకల లోకంబులై సాక్షియై అందమై ఆనందమై బ్రహ్మానందమై పరమానందమై సగుణమై జీవయీశ్వరులై జీవసాక్షియై ప రమాత్మయై ప్రత్యగాత్మయై ద్రష్టయై గురుడునై మంత్రమై మంత్రార్థ మై రామకృష్ణాద్యవతారంబులై బ్రహ్మమై పరమై పరంజ్యోతియై కూట స్థుడై అనంతమై నంతతానయై అమలమై నాదిమధ్యాంతములు లేక సూది మొన మోపసందు లేకయున్న పరమాత్ముడు అనగా కూటస్థుడైన ప్రత్య గాత్మ యిరువదినాలుగు తత్వములతో కూడియున్న యీస్థూలశరీరము అ నగా క్షరమని క్షేత్రమని అనాత్మయని మాయాశరీరమని యెరుకయని జడ మని అశాశ్వతమైన యీ దేహము॥

చ॥ మలినపు కొంపరోగముల క్రమ్మగ్గడు నేవపు గంపజంతుసం
చలనము నొందుదుంపభవ సాగరమీదగ నీనికంపనె
మ్ములుపలలమ్ములోలునర మల్పయికప్ప దలంపమేను ని
శ్చలమని నమ్మబోకు మనస్సా హరిపాదము లాశ్రయింపుమా॥

అను న్యాయానుసారము. శుక్లశోణితంబై పుట్టంటున పెరిగియు మలమూత్రములతో కూడియు యీపాదుశాక అనగా జీవుడువిడచిపోగా నే (కాటికికాని గొరగాదు గవ్వకైన) అను న్యాయానుసార[illegible]

త్తపరమాత్ముడు యీదేహములోవుండుటవల్ల అనగా (గీ॥ తోలుడొక్క లోను § దొడ్డవాడుండంగ। కుంభాలుబోతురు § గుళ్ళనడుమ.) అను పద మునకు నిజమయినఅర్థము వేమయ్యగారు జెప్పినదేమిటనగ యీపనికిమా లినదేహములో జీవసాక్షియైనపరమాత్ముడు అనగా దొడ్డవాడు వుండంగ వుండబట్టిగద వుండుటచేత కుంభాలుబోతురు గుళ్ళనడుమ యీదేహముల లోపరమాత్ముడున్నాడు లేనట్టైతె విగ్రహములపూజించుటయు ప్రసాద మునారగింపు చేయుటయు మొదలుగాగల పనులుజరుగవుగావున యీదొడ్డ వాడువెళ్ళిపోయినతరువాత యీకాయమునుంచుకున్నవారు లేరుగద యీశ రీరమునుజూచుకొని మేమేగొప్పవారమని నిక్కుచుందురుగనుక పరమాత్ము డు యీతోలుడొక్కలోనువుండబట్టి భక్తిజ్ఞానములవల్ల కడతేరుటకు కార ణమని జెప్పినారుగాని విగ్రహములు దేవుండ్లుగారని జెప్పినవారు కారు॥

శిష్యుడు:— అయ్యా, రాళ్ళుదేవుండ్లనిశలవిచ్చితిరి రాసులుమ్రింగవనుటకు కారణమేమిటో నాకుదెలువుండనిన శిష్యునకుగురుండిట్లనియె. రాళ్ళుదేవుండ్లైతె రాసులుమ్రింగవనుపదమునకు అంతరార్థమేమనగా॥

శ్లో॥ జలేవిష్ణుస్థలేవిష్ణు విష్ణుస్థావరజంగమ।
అంతర్విష్ణుబహిర్విష్ణు సర్వంవిష్ణుమయంజగత్॥

అనున్యాయానుసారముగ జలమందు భూమియందు స్థావరములం దు అనగా పర్వతములు గుట్టలు వృక్షములు రాళ్ళు నదులు వీటికిస్థావర ములనిఅర్థము. జంగమములనగ పశుపక్షి మృగ నరకిమికీటకములకు కా ళ్ళురెక్కలు వుండుటవల్ల కదులుట వురుకుట లేచిపోవుటవలన చరములని యు కదలకచలించక మెదలకయున్నందున అచరములనియు అట్టిఅచరము లకు అనగ పర్వతంబులు వృక్షములు మొదలుగాగల స్థావరములకు అన్న మవగైగాలుబెట్టితె తినవుగనుక ఆతీరుగానే రాళ్ళుదేవుండ్లైతెరాసులు మ్రింగవ అనుపదమునకు రాళ్ళేదేవుండ్లైనప్పటికిని రాసులుమ్రింగవు అ న్నమవగైగాలుతినవు యందువల్లననిన సాకారములుగానందున అనగా అనిత్యశరీరములుగావు నిరాకారములైనందున మనుజులుబెట్టిన పదార్థ ములుమ్రింగవు నిర్వికారములగుటవల్ల అన్నముతినవని జెప్పివారుగాని స్వా మ్యదేవుండ్లుగాదు రాళ్ళలోదేవుడులేడు రాళ్ళను పూజింపవద్దని జెప్పుటకు

వేమయ్యగారు దెలియని తెలివిహీనుడు కాదు అతీరున జెప్పినట్లైతే పరిపూర్ణమునకు హానిసంభవించును॥

శిష్యుడు:— అయ్యా పరిపూర్ణమునకు హానియెందువల్ల వచ్చును. గురుడు. ,,శ్లో॥ సర్వంఖల్విదం బ్రహ్మం,, అను శ్రుతులున్న (మల్లు గ్రుఱ్ఱపసందు లేదని భాగవతుల కృష్ణదాసుగారు జెప్పిన అచలమున్న) క॥ ఇందుగలడందు లేడని । సందేహమువలదు చక్రి సర్వోపగతుం । డెందెందు వెదకి చూచిన । అందందే గలడు దానవాగ్రణి వింటే. అను భాగవతమున్న, సర్వము బ్రహ్మమేయని బోధించెటి గురువులున్న ,,విద్యా వినయసంపన్నే బ్రాహ్మణె గవిహస్తిని । సునికేశహస్యమ దరిశనః పండితః,, అను జర్యోక్తియును యిన్ని విధముల జెప్పుచున్న పరిపూర్ణబ్రహ్మము అంతటా వున్నాడుగాని వొకతావున లేడని జెప్పుటకు వీలుపడదు యెందువల్లననిన రాళ్ళలో లేడని వొకడు నీళ్ళలో లేడని వొకడు కట్టెలలో లేడని వొకడు ఈ ప్రకారముగా సమస్త చరాచరంబులయందు లేడని అందరు అంతటా లేడని బలికెటి నాస్తిమతస్థులు దప్ప ఆస్తిమతస్థులందరు బ్రహ్మమొకడు వున్నాడని జెప్పుకుందురుగాని లేడనినోట వచించరు అట్లైతే.

శిష్యుడు:— అయ్యా అనేకమంది రాళ్ళలో దేముడు లేడని వాదింతురు యింతమంది తెలియని వారని జెప్పకూడదు వొక్కరినుంచి యింతపని కానేరదు (పదుగురాడు మాట పాటియై ధర జెల్లు । వొక్కడాడు మాటనెక్కదెందు) అనిన శిష్యునకు గురుండిట్లనియె. మంచిమాటలు వొక్కడు బోధించెవేని పదిమంది వినరుగాని జబ్బుపనులకు మాత్రము వొక్కడు జెప్పితే అందుకు తగినవారందరు ఒప్పుకుందురు చెడగొట్టుటకు వొక్కడే చాలును వొక్క పిల్లి నూరు పెండ్లిండ్లు చెడగొట్టునుగాని వెయ్యికూడినైన వొక్క పెండ్లి జేయనేరనివిధమున (క॥ ఎండినమ్రానొకటడవిన । నుండినవనం దగ్నిబుట్టి నూడ్చున్ చట్లన్ । దండిగలవంశమందున । చండాలుండొకడు బుట్టి జరచును వేమా) అను న్యాయానుసారముగ వక్కడే చాలును చెరచుటకు. వొక గ్రామములోనుంచి వొకయేనుగ వెళ్లిపోయినది తరువాత ఆపురజనులందరు గజము నుజూచినవారు కారు గనుక యింత పెద్ద జంతువులు నేమిటియని విచారింపగ వొక బుద్ధిమంతుడు జింకలవాడు విశ్రాయి జింకమెడకు కట్టితే తొయ్యాలేక నక్కిడక్కిడ పెట్టుకుంటాపోయినది మరివొకటి కాదని చెప్పగావిని

అందరునిజమని నమ్మినరీతిగ దుర్మార్గుడు వక్ర-డేచాలును అబద్ధములు నిజముగాజలికి భ్రమబెట్టుటకు అట్టివారికి లాభమేమనిన నూరు వెయ్యి రూపాయీలవస్త్రములు దుగ్గుదుగ్గుగాకొట్టుటకు పురుగులకులాభమేమి అటీరుగానే దుర్మార్గులు వేమయ్యగారుజెప్పిన పద్యములలోని అర్థము దెలియక వారికి సరివారందరు నమ్మదురుగాని మంచివారెప్పుడును అన్యాయములు జలికి న్యాయమునుజడగొట్టుటకు ప్రవర్తించరనిన॥

శిష్యుడు:— అయ్యా రాళ్ళకుబెట్టిన అన్నము తిననందున రాళ్ళు దేవుండ్లుకారనియును రాళ్ళను పూజింపకూడదని అన్నాముగాని పరమాత్ముడంతట లేడని అన్నామ యనికొందరందురు. గురుడు- అన్నిటికన్న ఈ ప్రశ్న మరీబాగున్నది యెందువల్లననిన (అమ్మనుదిట్టకులంజకొడుక) అనితమ్మునికోపము జేసినట్లుగానున్ను తేనెలో నీళ్ళుపోసినట్లుగానున్ను యింటికిఅగ్గిపుల్ల ముట్టించితే నెంత శోభాయమానముగా యుండునో అంతకన్న బాగాయున్నది యెందువల్లననిన దేశకాలవస్తుపరిచ్ఛేదములులేక అంతటా నిండియున్న పరబ్రహ్మమునకు అనగ పరిపూర్ణమునకు హానిసంభవించును నిరాకారమైనబ్రహ్మమునుపూజించుటకు నలవికానందున విగ్రహములనుపూజింపవలయు విగ్రహార్చనవల్ల భక్తికుదిరి భక్తివల్ల మోక్షముకలుగునుగాని రాళ్ళనివిడచిపెట్టినవారికిసద్గతిదొరుకదు యెందువల్లననిన,, శ్లో॥ పూజాహీనేభవేద్దోషం పుష్పహీనేధనక్షయం । దూపహీనే మహావ్యాధి దీపహీనేకులక్షయం॥

తా॥ విగ్రహముల పూజింపనివానికి దారిద్రమున్ను, ధనక్షయమున్ను, మహావ్యాధియున్ను, కులక్షయముగాగల దుఃఖములు సంభవించినందువల్ల అనేకజన్మములకైన కడతేరుటకు దుర్లభం గనుక విగ్రహములను పూజింపవలయును,, శ్లో॥ యాదృశీభావనాయత్ర తత్తద్భవతితాదృశీ,, అనున్యాయానుసారము. యెవ్వరేప్రకారము భావించి పూజించుచున్నారో వారికాప్రకారమె అనగ సాకారులకు సాకారముగాను నిరాకారులకు నిరాకారముగాను ప్రసన్నుడవుదునని భగవద్వాక్యము అన్ని మువిగ్రహములతినదన్నందుకు కబీరు, తులసీదాసు, నామదేవుడు మొదలుగాగల భక్తులు అనేకమంది సగుణారాధనజేసి సగుణభావమున నమ్మకున్నందున వారి[illegible] బెట్టిన పదార్థములు భగవంతుడు పుచ్చుకున్న వాడుకాదా వారందరు

అన్నముతినుపించినవారుకారా యట్లానమ్మకున్నవారికి అతిరుగానె దర్శనమిచ్చుటకునెంతమాత్రమును సందేహము దోపముగనుక విగ్రహములను పూజింపవలయును॥

శిష్యుడు?— అయ్యా అన్నమువగ్గి రాలు యెంత బెట్టినభక్షించిము నతోమాట్లాడుచున్న గురుని పూజింపకూడద విగ్రహములనే పూజింపవలయునా అనికొందరువాదించెదరు॥

గురుడు:— అంతబ్రహ్మమేయని బోధించినారుకాని రాళ్ళలోదేముడులేడు రాతినిపూజింపవద్దు నన్నేపూజింపుడని జెప్పినాడ అట్లజెప్పుటకు మందమతిగురువులుదప్ప మంచివారెప్పుడును నన్నేపూజింపుమని బోధించరుగాని పన్నెండుమరూపాయీలకు పన్నెండోపరిపూర్ణము జెప్పెదానని గ్రామములుతిరిగేతండిబోదులు నన్నేపూజించుమనియు రాళ్ళనుపూజింపవద్దనిజెప్పెదరు గురుడనగా గుకారము సాకారము రుకారము నిరాకారము రెంటితోకూడియుండుటవల్ల శిష్యులకుబోధజేయుటయు పదార్థములు భక్షించుటయుగలుగుచున్నది కేవలనిరాకారముబోధించదు అన్నముభుజియింపదు గనుక॥

సీ॥ ధరణిలోపలనారారు ✧ తత్వములకు।
నవ్వలై యున్నపరతత్వ ✧ మెవ్వడెరుగు।
శివుడుగురురూపమునవొచ్చి ✧ జెప్పకున్న।
నవ్యతరభోగి శ్రీసదా ✧ నందయోగి॥

తా॥ సమస్తతుభములతోకూడుకొనిన పరమాత్ముడె శ్రీగురురూపముదాల్చి శిష్యులనుకడతేర్చుటకు వచ్చిన యాచార్యులను నమ్మవలెక॥

శ్లో॥ గురుత్యాగిమహారోగి మంత్రత్యాగిదరిద్రతః।
గురుమంత్రంద్వయం త్యాగి రౌరవంనరకంవ్రజేత్॥

తా॥ కొందరుగురువును విడుచుటయు కొందరుమంత్రమునువిడుచుటయు మరికొందరు గురుమంత్రములవిడచి నరకములబడుచున్న పామరులు గురువుల యెదట మంచములువేసుకొని సుఖముగాపరుండెడి దుర్మార్గులు అనగా తల్లికిఅన్నముబెట్టవివాడు లేదనకుండా అన్నసత్రము బెట్టినాడన్నట్లుగా గురువును గాని విగ్రహములనుగాని నిజముగానమ్మి యెప్పటికిని పూజింపడు వాడుయెన్ని జన్మములకైన కడతేరడు భక్తిప్రపత్తియుగల్గి గురువును

శాలి విగ్రహములనుగాని నిజముగా పూజించువాడె మోక్షంబొందును యింతమాత్రమును సందేహములేదు॥

శిష్యుడు:— అయ్యాగురుస్వామి కొందరుత్రొక్కుడిరాయి మొత్తుడిరాయి గోడకట్టేదిరాయి అన్నిరాళ్ళను పూజింపక గుళ్లోరాతిని పూజించుతారని అపహాస్యములు జేయుచుందురు॥

గురుడు:— చాత్రవర్యా వినుమనిరి॥

క॥ అమ్మనగాయాలుసుమీ। అమ్మనుమీయాలనగను ౘ నాయిద్దరిలో।
యిమ్మహిపరమాత్మునిగా। నెమ్మదిగా జూచువాడౘ నేర్పరివేమా॥

తా॥ అమ్మయందును భార్యయందును చూడగా రూపనామములు అవయవయములునొకటిగానేయుండును వొకటిగాయున్నప్పటికిని ,,మాతృదేవోభవ-పితృదేవోభవా,, అను న్యాయానుసారముగా మొదటిదైవము తల్లి రెండోవాడు తండ్రిమూడోవాడు గురుడునాల్గవవాడుదైవమూ అనగ తల్లి తండ్రినిజూపెను తండ్రిగురువునుజూపెను గురుడు భగవంతుని చూపించుటకు భగవంతుడు కనుపించనివాడుగనుక శిష్యునకుమంత్రము వుపదేశముజేసి యామంత్రము నిత్యము జపముచేయుమని శలవిచ్చును శలవిచ్చినప్పటికిని గురినిల్వదని వొకయంత్రమునుగాని లేకవిగ్రహార్చనముగాని గురుపాదుకలుగాని పూజించుమనిజెప్పి పూజజేయింపగా నానాటికిభక్తి కుదిరి భక్తిద్వారాజ్ఞానముకలిగి గురుసాక్షాత్తు పరబ్రహ్మమను వాక్యము పట్టుబడి జ్ఞానమువల్ల మోక్షమును పొందునుగనుక మొదటిదైవముతల్లిగాను నంమ్మన॥

శ్లో॥ భూప్రదక్షిణషట్కేన। కాశీయాత్రయుతానిచ।
శేతుస్నానశతైరపిః। తత్ఫలంమాతృవందనం॥

తా॥ ఆరుసారులు భూప్రదక్షిణమున్ను పదివేలమార్లుకాశీకిబోవుటయున్ను నూరుమారులు శేతువలో స్నానముజేయుటయున్ను యీపుణ్యమంతటికిని సమానమైనది వొకసారితల్లికిజేసిన వందనముగనుక కొమారుడుతల్లినిపూజించును భార్యతోభోగించును తల్లినిపూజించిన దేహమునగుణమె భార్యతోభోగించినదేహము సగుణమె కాబట్టి॥

గీ॥ తోలుతోలులేసిన్ని తోమంగతోమంగ। కారికారిముద్దౘ కట్టుబడును।
మురజూచివగులౘ ముద్దాడుచుందురు। విశ్వదాభిరామ వినరవేమా॥

గీ॥ తల్లిదండ్రిఋణము దైవఋషిఋణములు।
తన్నుగన్నదీరు తత్వమందు।
పరమగురునిసేవ పాటింపకున్నను।
ఋణముదీరదండ్రు రూఢిమునులు॥

తా॥ తల్లిదండ్రుల శుక్లశోణితములవల్ల వచ్చిన దేహముగనుక కొమారుడుతల్లినిపూజించును పూజించినప్పటికిని తల్లిఋణము యెన్నిజన్మములకైన తీరదుగనుక కొమారుడుభక్తిజ్ఞానమువల్ల మోక్షమునుపొందినయెడ తల్లియు దండ్రియు గురుదైవములఋణముతీరునుగనుక అట్టిమహారహస్యము నెరిగిన వేమయ్యగారుకనుక మాతాసతులయందు భేదబుద్ధినుంచుటవల్ల మాయవదలక కతతేరలేదని ॥నాయిద్దరిలో। యిమ్మహి పరమాత్మునిగా। నెన్నదిగాజూచువాడు నేర్పరి వేమా॥

తా॥ తల్లిని పూజించుటయు భార్యతోభోగించుట యున్నప్పటికిని తల్లిలోను భార్యలోనువున్న పరమాత్ముడువకడేయని భావించిన యెడల మాతాసతులయందుకలిగిన ద్వందభావముఅనగా మాయాసంబంధమైన భ్రమయునంతయు నశించేదిగనుక ,,యదృశ్యంతన్నశ్యం,, అనురీతిగమాయనశించును అదియట్లనిన, వొకబ్రాహ్మణుండు జాతసూతకము లొచ్చినప్పుడు సంధ్యావందనముజేయవద్దనికొమారునకు జెప్పెను ఆచిన్నవాడుపరిపూర్ణజ్ఞానియైబొత్తిగా సంధ్యమానెను అంతటతండ్రి చిన్నప్పుడేనమాము యిప్పుడుబొత్తిగా కర్మమానితివనెను॥

శ్లో॥ మాయామోహమాతామృతే। జ్ఞానేబోధమయాసుతః।
సూతకద్వయసంప్రాప్తం। కథంసంధ్యాముపాస్మహే॥

తా॥ మాయతోకూడుకున్న మోహమనేతల్లి చచ్చిపోయినందువల్ల సూతకము జ్ఞానమనే కొమారుడుకలిగినందున పురుడువచ్చెను అందువల్ల విడచినానని జెప్పినట్లుగా॥

శ్లో॥ మాతానాస్తిపితానాస్తి। నాస్తిబంధుసహోదరః।
అర్థంనాస్తిగృహంనాస్తి। తస్మాజ్జాగ్రతజాగ్రత॥

తా॥ తల్లియు దండ్రియు ధనముగృహముయు మొదలుగాగలవన్ని యునశించిపోవునుగనుక తల్లిలో భార్యలోవున్న పరమాత్మునొకటిగా [illegible] వేమయ్యగారు నెన్నదిగాచూచువాడు పన్నుతీరుగా [illegible]

యిలోను మ్రొక్కినరాయిలోను గోడకట్టినరాయిలోను వున్నవాడు పరమాత్మ్మడేయని భావించినయెడల అంతాపరమాత్ముడని నమ్మినవారికి రాళ్ళనే భావము నుండనేరదుగనుక అటువంటివారలు కడతేరుదురుగాని రాళ్ళనినమ్మిన వారెప్పటికిని కడతేరరనినవిని మగల॥

శిష్యుడు:— అయ్యా దేముడంతటయున్నాడని శెలవిచ్చితిరి రాళ్ళలో లేద రాతినిత్రొక్కకూడదుగద గోడకట్టకూడదుగద యనిన శిష్యునకు గురుండిట్లని దెలుప నారంభించెను॥

గురుడు:— ఛాత్రవర్యా ఆతీరున విచారించినయెడల సర్వముబ్రహ్మమె అంతఅచలమె అంతాపరిపూర్ణమేయని శాస్త్రములు పెద్దలు గురువులు ననేకవాక్యముగా బలుకుచున్నవి యిందుకు సందేహములేదుగాని నరపశు మృగకీటకములు యెక్కడనుండవలె యాహారములు యట్లాజరగవలె యేతీరునతిరుగవలె మలమూత్రములు నెక్కడవిడువవలెనో నీవెశెప్పుము యీసంశయముదీర్చుటకు శతసహస్రముఖులకైన దెలుప తరముగాదు అదియట్లనిన అమ్మలో వున్నవాడు భార్యలోవున్నవాడు వకడెపరమాత్ముడని భావించుమని వేమయ్యగారుజెప్పినారుగాని అమ్మదేహము భార్యదేహము పరమాత్ముడనిజెప్పలేదుగనుక ఆవిధముగానె రాళ్ళలో నీళ్ళలోనిప్పులో మంటలోనీలో నాలోసమస్తచరాచరంబులలో పరమాత్ముడున్నాడని జెప్పినంతమాత్రమున బాధకమేమియునులేదు యెందువల్లననిన కుండనువిచారింపగమన్నె మన్నుయని తెలుసుకున్న మాత్రమున కుండపాకాది క్రియలకు యేతీరునవుపయోగపడునో ఆరీతిగానె అంతపరమాత్ముడని గ్రహించినప్పటికిని సమస్తపనులకు నుపయోగపడును అది యట్లనిన త్రొక్కినరాతిలో మ్రొక్కినరాతిలో గోడకట్టినరాతిలో త్రొక్కెవాడిలో మ్రొక్కెవాడిలో ఆతీరుగానె మ్రొక్కినవాడు మ్రొక్కబడినది త్రొక్కినవాడు త్రొక్కబడినది నడచినవాడు నడవబడినది వురికినవాడు వురకబడినది నీవు నేనునీలో నాలో సర్వముబ్రహ్మమేయనగ ,,కర్తాకారకశ్చైవ భోక్తాజనార్దన,, అనున్యాయానుసారముగ అంతాపరమాత్మ్మడేకనుక యిదమిద్ధని నిర్ణయింపనెవ్వరికిని శక్యముగాదనగ తరువాతను॥

శిష్యుడు:— అయ్యా అంతాబ్రహ్మమయమైనప్పుడు మధుమాంసభక్షణము జరిగించుటకు భేదమేమి కోయువాడు కోయబడినది తినువాడు

తినబడినది కొట్టినవాడు పెట్టినవాడు అంతబ్రహ్మమేయనినమ్మినవానికి దో
షము లేదుగదా॥

గురుడు:— అంతపరిపూర్ణ జ్ఞానముకలిగి లేకద॥

గీ॥ ఆశకోసివేసి § అనలంబుజల్లార్చి।
గోచిబిగియుబట్టి § కోపమణచి।
గుట్టమీదివాడు § గురువునకుగురువుగా।
విశ్వదాభిరామ § వినరవేమా॥
కచ్చమీదినాస § కనకంబుమీదాశ।
లేనివాడుపృథివి § లేనివాడు॥

తా॥ సమస్తకోరికలువిడచి జగమమరచి దేహభ్రమవదలి మంటి గడ్డనురాయిని బంగారమును వకటిగాభావించువాడు సమస్తజీవులను చంపినను చంపనివాడె సర్వముభక్షించినను భక్షింపనివాడె అట్టివాడె సమస్త గురువులకు గురుడని వేమయ్యగారు జెప్పినఅర్థము॥

శా॥ గాలిందూలినవానసేదడిసినన్ § గాఢాగ్నిచేఁగ్రాగినన్।
వ్యాళంబాత్మవిముక్తకంచుకముపై § వ్యామోహముందాల్చిన
ట్లాలోలాంగముపైనిరూఢమమతా § హంకారముఙ్ లేకయా।
త్మాలోకస్థితినుండుపండితుఁడని § త్యానందముఙ్ బొందుదు॥

అనున్యాయానుసారముగ దూషణభూషణ తిరస్కారంబులు దేహమునకేకాని ఆత్మకులేవని సుఖ దుఃఖములకు చలించనివారికి నేమిజేసినను జేయనివారె నెంతతిన్నను తిననివారె అట్టిమహానుభావులకు దోషము జెప్పకూడదు తరువాత॥

శిష్యుడు:— అయ్యా యిప్పటి గురుశిష్యులందరు యీభావముచేతనే జపతపములు విగ్రహార్చనజేయకూడదని అందురేమి॥

గురుడు:— యీమనుజులు అనగాయీతీరున పరులనిందించెటి గురుశిష్యులకు ఎంతమాత్రమును పరిపూర్ణజ్ఞానమును లేదు యిందువల్లననిన చెప్పేవానికి బాదస్తమును వినేవానికి వివేకములేదని జెప్పినరీతిగా వీరంద రుసామాన్యులనియె పరిగణింపబడుచున్నది॥

శిష్యుడు:— తమరుయిట్లా తెలుపుము॥

గురుడు॥ గీ॥ ఉప్పుకప్పురంబు § నొక్కపోలికనుండు।
జాడబాడరుచులు § జాడవేరు।
పురుషులందుపుణ్య § పురుషులువేరయా।
విశ్వదాభిరామ § వినర వేమా॥

తా॥ శిష్యాశిష్యాయని బిలచితె నాపేరుయెవరుజెప్పినారనగ నిశ్రేష్ఠులేజెప్పినవని అన్నట్లుగా వీరిదుర్గుణములుగుణ్డతలు ఆశాపాశము లుమాత్సర్యములు మమతాహంకారములు పరనిందయు మొదలుగాగల నేకములుగలవు గావునవీరికిసర్వజ్ఞులైనవారి దశపట్టదుగాని అంతవారమ నిజెప్పుచుందురు॥

గీ॥ మచ్చపులినిజూచి § మసలుకొనియూనక్క।
కచ్చుకచ్చులుబడా § కాల్చుకొనిన।
పుచ్చిచచ్చెగాని § పులిరూపురాదాయె।
విశ్వదాభిరామ § వినర వేమా॥

తా॥ గొప్పవారమనిజెప్పుటవల్ల నక్కగతేసంభవించునుగాని యట్టివారమని మంచివారెప్పుడును జెప్పుకొనరుగావున నొకగొర్రెగొల్లో ఘూకగానె దానివెంబడినొకటొకటి ధుమికిమృతించినట్లుగాను వకమూర్ఖశిఖచించినొకచెట్టుమీదవేసితె అందరు అదేప్రకారము వేతురుగాని నొకరైనవిచారించనివిధమున పెద్దవారమనిజెప్పుకొనుట యరుగుదురుగాని తారతమ్యము విచారింపరు యెందువల్లననిః॥ క॥ పెశవమునవేనుంగయు। చిత్తయుదినగోరుసీమ § చిన్నతనమునక్। హత్తుకొని నిదునుషరుట। అను న్యాయానుసారముగ॥

గీ॥ యుక్తియుక్తమైన § ముక్తులుబాలుంతు।
జెప్పవేనివినుము § చిత్తగించి।
అన్యవచనమద § బ్రహ్మజెప్పిన।
తృణముబోలవిడువు § ధీరవర్యా॥

తా॥ మేముసర్వజ్ఞులమై అన్నిపనులువిడచినామనిజెప్పెటివారు అశ్వైతకములు ఆశాపాశములు దేహభ్రాంతియు వదలుతున్నవారివలె అన్నియు విడచినారా॥

శిష్యుడు:— నివిఅన్నియు కొంచమధికముగానే కనుపించును॥

గురుడు:— పెద్దవారమని జెప్పుటవల్ల వారిమాట వినకూడదు వేనుక పెద్దలైనప్పటికిని ఆకులలము గడ్డితిన్నవిధముగ అబద్ధములు బల్కుచుందురు కొంచమైనజ్ఞానము లేక బుద్ధిహీనులచర్యలు మంచివారు పిన్నలైనప్పటికిని పంచార మంచిబెల్లముపగ్గిరాలుతిన్నలాగున నిజములె కెదరు మంచిమాటలుజెప్పినయడల పిల్లవాడైననువినవచ్చును పనికిమాలిన మాటలు బ్రహ్మదేవుడుజెప్పినను వినకూడదనిజెప్పగావిని మరల॥

శిష్యుడు:—అయ్యా కొందరు ,,చిల్లరరాళ్ళకు మ్రొక్కినమనుజుని చిత్తముచెడురావరేవరే,, అనిఅన్నారని విగ్రహములకుమ్రొక్కకూడదందురు॥ గురుడు:— చిల్లరరాళ్ళనగ చిన్నచిన్నవని అర్థముగాదు నిజమైన అర్థమేమనగ॥

శ్లో॥ మన్నాథశ్రీజగన్నాథ మద్గురోశ్శ్రీజగద్గురో।
మమాత్మే సర్వభూతాత్మ తస్మైశ్రీగురవేనమః॥

తా॥ నన్నురక్షించెవాడే జగన్నాథుడు మద్గురుడేజగత్తుకెల్ల గురుడు మమాత్మేఅనగా నాలోవున్నపరమాత్ముడే సర్వభూతములలో వున్నాడుఅని భావించిమ్రొక్కుము చిల్లర రాళ్ళనగా పనికిమాలిన రాళ్ళని విగ్రహములకుమ్రొక్కితే నీచిత్తముఅనగా మనస్సుచెడునువరేవరే అనివకసారికి రెండుసారులుజెప్పినారుగాని రాళ్ళలోదేముడులేడనియును రాతి విగ్రహములకు మ్రొక్కవద్దనిజెప్పినవారుకారుఅనగ దుర్మార్గులుదప్ప సన్మార్గులెప్పుడునుఅనరు వారుచెవులవినరు॥

గీ॥ యెదురుబద్దవేసి § బిగియించికట్టినా।
కుక్కతోకవంక § కుదురబోదు॥

అనుశామితచొప్పున కూడుయంతబెట్టినను కుక్కదొంగతనముమాననట్లుగ పామరులకుమంచిమాట లెన్నిబోధించినను తమబుద్ధినిమానరు॥

సీ॥ ఎకసక్కెమునకైననిందిరారమణుని § బలుకంగలేనిదుర్భాషితులను।
గలలోననైనశ్రీకాంతునిసత్పాద § కమలముల్ జూడనికర్మరతుల।
నవ్వుచునైనగృష్ణప్రశంసకుజెవి § దాలవేయనిదుష్కృతాభిరతుల।
యాత్రోత్సవంబులనైనసీతనిగుడి § త్రోవద్రొక్కగలేని దుష్టవృత్తుల।
పరమభాగవతుల § పాదధూళిసమస్త। తీర్థసారమనుచు § దలియకున్న।
వారివారివారి § వారిజేరినవారి। దొలుతగట్టితెండు § దూతలారా॥

తా॥ భక్తులనుదూషించువారలను భగవంతునినిందించువారలను విగ్రహములను పూజించకూడదనుపామరులను యింకా అనేక పాపములు జేయువారలకూడినవారును అటువంటివారిని జేరినవారును జేరినవారిని నను సరించినవారును అనగాయీనాలుగుతంతెలవారిని దొందరగా నాగపాశములతో కట్టుకొని తెమ్మనియమధర్మరాజు తనయమదూతలకు అజ్ఞాపించి నాడని చెప్పిన భాగవతముచొప్పున అట్టిదుర్మార్గులచెంతకుబోగూడదు వారిమాటలువినకూడదు మీవద్దకు అటువంటివారిని జేరనివ్వకూడదు కుక్కను అందలమునకూర్చుండబెట్టితే సంతోషింపక కుచ్చులన్ని కొరికినరీతిగా మంచివారివద్దకుబోయి వారి సన్మార్గములువినిమైనా సంతోషించక లేనిపోని గొండెములుబెట్టి తగువునకు కాలుదువ్వుచుందురుగాన కలలోనైనావారి సాంగత్యంబుమూని యుండవలయునని బోధింపగవిని తరువాత॥

శిష్యుడు:— అయ్యా మహానుభావులు పామరులవద్దకు పోయిన మాత్రమున హానియేమియనిన శిష్యునకు గురుండిట్లనియె॥

క॥ అధికుండల్పుని జేరిన। అధికున దేతప్పుగాని క్ష యల్పుని తప్పా।
కొలనిడచికొండ కేగిన। కలహంసలతప్పుగాని క్ష కాకులతప్పా॥

అనున్యాయానుసారముగ మూఢులచంతకు పోగూడదు మూఢులతో సహవాసము చేయకూడదు యందువల్లననిన,, సాంగత్యదోషే గుణేభవతి,, అనున్యాయానుసారముగ వారిపొంతలకుబోయినమాత్రముననే వారివారి మర్ఫ్ధలుజేసి బుద్ధినిజెరచెదరు లేదా వారితో దుర్వివాదాదులతో కాలహరణమౌనుగాన కలలోనైన మరచియైన వారిజోలికి పోగూడదు అనిన తరువాత॥

శిష్యుడు:— అయ్యా గురుస్వామి కొందరు నిరాకారపూజ జేయవలయునని యెందురు నిరాకారమును పూజించుటవిధమేమిటి॥

గురుడు:— భక్తవర్యా వినుమనియె నిరాకారమునుపూజించుటకు సేవించుటకు నలవిగానందున అనగా అవాఙ్మానసగోచరమైనందున సాలగ్రామము విగ్రహార్చనయును గురుపాదుకలు గురుపూజయుజేసి నానాటికి సాకారధ్యానము జేయువచ్చునుగాని యిప్పటివారలలో కొందరు నిరాకారపూజ యనివస్త్రములువిడచి జేయుచుందురు శిష్యుడువస్త్రములనుపూజించుటవల్లనే గురువునిపూజించినట్లా గురువునేపూజించినట్లయి లేవస్త్రములు

యున్నందునజబ్బుయేమి- గురుడు- వస్త్రములుంచుకొని పూజించినందున జబ్బు నెంతమాత్రమునులేదు, యీసంశయమేమిటో నాకు తెలుపుమనిన శిష్యునకు గురుండిట్లని తెలుప నారంభించెను.

పూర్వకాలంబున త్రిపురాసురలసంహరించుటకు కల్పించినమతము లునెవ్వియనగ బౌద్ధపాషాండమతములకు కొన్నిమార్గములు గల్పించినారు వాటినివివరించెద, ౧- నిరాకారపూజ ౨- మాసపుష్పము ౩- రవికలఉత్సవం ౪- చీరెలఉత్సవం ౫- అశ్వద్ధామ పూజయును ౬- మైధనమును ౭- పంచామృతమును- ౮- అప్పుడిసిద్ధమైన దొంగతనమైనచేసిబ్రతుకవచ్చును- పరస్త్రీలనుభోగింపవచ్చును పునఃజన్మములేదు కర్మములేదు పుణ్య పాపములులేవనివాదించుదురు నింకా కొన్ని నోటబలుకకూడనిపనులుజరిగించెదరు త్రిపురాసురలభార్యలు మహా పతివ్రతలుకనుక వారిసత్యములు చెరచుటకు నిర్మించినమతములు యిప్పుడుకొందరుఆతీరుగానే జరిగించెదరు యీయనిమిది మార్గములవారందరు నింకా యీమతములలో అనేకశాఖలుగాప్రవర్తించెవారందరు యీదుష్టమతములనవలంబించి అనేకపాపములవల్ల అనేకజన్మములెత్తుచు నరకములబడిపోయెదరు నిరాకారపూజ జేయవలయుననే యిప్పటివారందరు వారికి కొంచమంతసమానులే యని చెప్పగా వినయును॥

శిష్యుడు:— అయ్యాకొందరురామకృష్ణులు దైవములుకారనియును వారినిదలువకూడదనియు ను వాదించెదరు॥

గురుడు:— కామక్రోధములు మోహపాశములు మదమాత్సర్యములుహెచ్చి మదించికన్నుమిన్నగానక తిరుగుచుపదరుచుండె పొగరుబోతుల అజ్ఞానమువదలించుటకు నొకమిషమీదకబీరుదాసు గోపీదాసులిద్దరు అనగా రాముడు దేవుడుకాడని గోపీదాసు కృష్ణుడు దేవుడుకాడని కబీరు దాసువారిద్దరునొకరొకరిని మతములనిందించుకొనుచును నొకరొకరిదైవములదూషించుకొనుచును కబీరుమా రాముడేసర్వజ్ఞుడనియును గోపీదాసు కృష్ణుడే సాక్షాత్తుపరమాత్ముడనియును వారివారిదైవములప్రభావము లెన్నుకొనుచును గొప్పగారోషములుపెంచుకొని అట్టహాసముచేతకొట్టుకొనుచున్నసమయమున శ్రీమన్నారాయణమూర్తి బ్రహ్మనుసరస్వతిని మహా దేవుని శివుని పార్వతిని నొకకొకరునిబంపి వారివివాదముదీర్చి

గావాడుసన్మతించి నొకరితరువాతనొకరువార్చి మీరుముఖ్యమైనభక్తులై యుండియు శ్రీరామకృష్ణుల నిందించుకొనుట మీకు భావ్యముకాదు రామ కృష్ణులిద్దరు దైవములెయనియును మీరునిజమైనభక్తులై యుండియును యీ ప్రకారము నొకరొకరినిదూషించుకొనుచు దైవములనిందించుకొనుట భా వ్యముకాదని నెంతబోధించినను వినకున్నసమయమున నారాయణమూర్తి తాను వుపేక్షించినయెడల ధర్మముజడిపోయి భగవంతుడులేడందురని భా వించి తానుశ్రీరామరూపమునవచ్చి యిద్దరినడుమనునిలచెను అంతలోకబీ రుపోయి మూడుసారులు ప్రదక్షిణములుజేసి మ్రొక్కెను తరువాతకృష్ణా వతారుడైనిలచెను వెంటనేరోహి భక్తిప్రపత్తితోమ్రొక్కెను భగవంతు డుభక్తులనుచూచి మీరిద్దరుతెలియక వాదించుచున్నవారు కారుగనుక లోక ములో అజ్ఞానులు రామకృష్ణులుదేవుండ్లుకారనినిందించె పామరుల నోళ్లు మూయించుటకుజేసిన మీప్రజ్ఞావిశేషంబులకుమెచ్చితినని శలవిచ్చిఅంతర్ధా నమాయెననిబోధించగావిని తరువాతను॥

శిష్యుడు:— అయ్యా గురుస్వామి కొందరు శివుడు దేవుడుకాడని యు మరికొందరు విష్ణువుదేవుడుకాడనియును నొకరినొకరుదైవముల నిం దింతురెందువల్లననిన॥

గురుడు:— పూర్వకాలంబున శివభక్తులు విష్ణుభక్తులు కూడుకొ నిశివకీర్తనలు విష్ణుకీర్తనలుపాడుచు కాలము బుచ్చుచున్న సమయంబున నొకహరిదాసు గారువచ్చి, రాముడెదేవుడూయని నొకకీర్తనపాడిరి అ ప్పుడు శివభక్తులుమాశివుడుదేవుడుకాడా యని హరిదాసుగారిని అడగగా నె రామభక్తులందరు అవును మారాముడెదైవమనిఅనిరి మాశివుడెదేవు డనిశివభక్తులనిరి ఆపైనినొకరొకరు కోపములు దెంచుకొని కొట్టుకొనబో వుసమయమున శ్రీమహావిష్ణువు తానుబోయి వీరిమూఢత్వము తీర్చనియెడల భంగమొచ్చుననితలంచి శ్రీరామరూపమున యిద్దరినడుమనిలచెను వెంటనె రామభక్తులందరువచ్చిమ్రొక్కిరి వెంబడె ప్రళయకాలరుద్రుండైనిలచెను శివభక్తులందరుమ్రొక్కిరి తరువాతనుభగవద్వాక్యము॥

శ్లో॥ సర్వదేవనమస్కారం। కేశవంప్రతిగచ్ఛతి।
ఆకాశాత్పతితంతోయం। యథాగచ్ఛతిసాగరం॥

తా॥ రాముడను నేనె కృష్ణుడను నేనె శివుడను నేనె బ్రహ్మను నేనె విష్ణువును నేనె సర్వచరాచరములు నేనెయని యెవరు భావించినన్ను నమస్కరించుచున్నారో అట్టివారందరు జేయబడిన నమస్కారములన్నియు నాకె కెందును అదియట్లనిన- ప్రపంచమునకురవబడిన వర్షమంతయు సముద్రమును నకుపోయినరీతిగా నన్నే జేరును॥ శ్లో॥ కాంతేయప్రతిజానీహే। నమేభక్త ప్రణస్యతి॥ అనున్యాయానుసారముగ నన్నుగాని శివునిగాని నమ్మితున్నవారు సకలపాపములనుంచి విడువబడి నావైకుంఠమునకు వచ్చెదరనిన భాగవద్వాక్యము॥

శ్లో॥ మద్భక్తాశంకరద్వేషి। మద్వేషి శంకరప్రియః।
తావుభౌనరకంయాంతి। యావచ్చంద్రదివాకరః॥

అనున్యాయానుసారముగ శివభక్తులునన్ను దూషించినను నాభక్తులుశివునిదూషించినను వీరువారు చంద్రసూర్యాదు భూమియున్నంతవరకునరకముతప్పదనగ అటువంటిదుర్మార్గులు బహుమందికిని ౧ కులమదము ౨ ధనమదము ౩ విద్యామదము ౪ రూపమదము ౫ రాజ్యమదము ౬ శీలమదము ౭ యవ్వనమదము ౮ తపోమదము యీయెనిమిదిమదములచేత మాయంతవారులేరని గర్వించి పరులదూషించెడుమార్గులు భాగవతునినిందించుచు విగ్రహార్చనచేయకూడదు విగ్రహములు రాళ్లేకద అట్టిరాళ్లను పూజింపకూడదనే మహాపాతకులకు యెన్నిజన్మ ... నను నరకము తప్పదని భగవద్వాక్యము॥

గీ॥ చెప్పులోనిరాయిక్షి చెవులోనుజోరిగ।
కంటిలోనరసుక్షి కాలెముల్లై।
యింటిలోనపోరు క్షి యింతింత కాదయా।
ఎశ్వదాభిరామ క్షి వినర వేమ॥

తా॥ యీవేమయ్యగారు జెప్పిన యీపద్యమునకు ... అర్థము చెప్పుచుంటిరు అచ్చేప్రకారము వీరు జేసినపద్యములన్నిటికిని ... ర్థములుకలవని తెలిసికోగలరు మీరుపుస్తకాసారముగా జెప్పుచున్న ... దల శ్రుతివిరుద్ధముగా నమ్ముటెల్ల దోషముకట వేమయ్యగారి అభిప్రాయము తప్పించుటచేసు నిజమును దెలియక అన్యాయమును చేస్తున్నారు ఇవి

తిధర్మమును నశింపజేయుటమూలము యీత్రివిధములైనదోషములవల్ల మహా పాతుకులై అనేకజన్మములకైన గడతేరలేరనగవిని తరువాత॥

శిష్యుడు:— అయ్యా భగవద్భాగవత విగ్రహార్చనజపతప పుణ్య పాపస్వర్గ నరకజన్మంబులు లేవనిపలికి దూషించెవారందరును పాపాత్ము లేయనిచెప్పినందున తమయందుయీర్ష చేత మీరుపరుల నిందించినారనియు మిమ్ములకూడ దోషివనియందురేమొగద అనినశిష్యునకు గురుండు డెలుప నారంభించెను॥

చాత్రవర్యా- అయితె పరులదోషములెన్నుటచే పాపాత్ముడ వయ్యెదవనినచో అట్టిపాపాత్ముల పాపంబులుచేయకూడదని న్యాయాన్యా యములపరిశీలించి అన్యాయముజేసినవారిని శిక్షించునట్టిప్రభువును పాతకు డనుట యుచితముకాదు కాబట్టి పరులదూషించెడి పాతకుల పాతకులని చెప్పుట తప్పుగాదుమరియును॥

ఉ॥ తప్పకనర్భకావళికి తల్లియు దండ్రియు నేత్రదీపం కికిన్।
రెప్పలు పాతకిన్ బతిసతి రేంద్రుడు లోకుల కెల్ల నధీశకిన్।
నొప్పగృహస్థుమూఢులకు నుత్తముదెన్నగవిరుబంధువుల్।
ముప్పునగావలేనికడు మూర్ఖులు సుమ్మిసమస్తబంధువుల్॥

తా॥ చంటిపిల్లలకుతల్లిదండ్రులును కన్నులకు రెప్పలును భార్యకుభ ర్తయును లోకులకురాజును యాచకులకుగృహస్థులును మూఢులకు శ్రేష్ఠ లగుజ్ఞానులును క్రమముగాబంధువులనియును పిల్లలులోనగువారిని తల్లిదం డ్రులుమొదలగువారు కష్టకాలమున రక్షింపకున్న నీబంధువులందరునుమూ ఢులనీ భాగవతములో చెప్పియున్నదిగనుక భగవద్భక్త దూషణజేసినవా రికి పాపముసంభవించునని యు నాపాపముచే నధోగతికి బోదురనియును డెలిసినవారు పరోపకారముగ భగవద్భాగవత దూషణజేసి నరకమునకు బోక దాగుపడుమనని చెప్పుట తప్పుగాదు॥

శిష్యుడు:— అయ్యా గురుస్వామి యెవరిభక్తివారికే యెవరిపుణ్య మువారికే అంతపుణ్యముజేసి స్వర్గమునకుబోతె నరకము పాడుగాదా అందరుభక్తిజ్ఞానములచేత మోక్షమునకుబోతె ప్రపంచమునశింపదాయని యందురేమొ గురుడు:యెవరిభక్తివారిదే యెవరిపుణ్యమువారిదేయనిఅన్నం దునసంతోషించితినుగాని అపరికారముగమనస్సునకుబుద్ధిచెప్పకొనియూర

తుంటక జపతపములు విగ్రహార్చనలు జేయువారలజూచి జేయవద్దనిదూషిం
చినందున దూషకులకు చండాలత్వమువచ్చి నరకమునకుబోతారని మంచి
మాటలుజెప్పితినిగాని అంతస్వర్గమునకుబోతే మేమునరకమునకుబోతమ
నియు అంతామోక్షమునకుబోతే మేము జననమరణములచేత ప్రపంచము
నిల్పుతామనియు మీరొప్పుకున్నయడలమీజోలిమాకెంతమాత్రము నకఠార
బట్టదుగాని మేమేమిజేసినను మేమెట్లా జెప్పుకున్నను మాజోలి తలవకుంత
యుండుటవల్ల మీరెబుద్ధిమంతులని నాయభిప్రాయము॥

శిష్యుడు గురుస్వాములకనేకవందనంబులుజేసి మీవల్ల నేటికి నాస
కలసంశయములుతీరి నేనుకృతార్థుడనైతినని మరలమీరలఅనేకదండప్రణా
మంబులాచరించి స్వేచ్ఛగా వెళ్ళిపోయెను॥

క॥ మంగళమునీకురాఘవ।
మంగళముజనకసుతకు ॥ మద్గురుకెళ్ళుమున్।
మంగళముఅచ్చమాంబకు।
మంగళముతల్లిదండ్రికి ॥ మంజులరామా॥

క॥ వేశైదుపదియుమూడును।
వాలాయముపర్విధావి ॥ వత్సరపుష్యం।
మేశైనశుద్ధతదియల।
కాలంబుకుజెప్పిరాము ॥ కర్పణజే స్తిన్॥

క॥ ఫణివైరిగమనుదండ్రి।
ఫణిబంధువుసుతుమనతమ ॥ భక్తుడుయశము।
స్మణిమంత్రమొసగిబ్రోచిన।
ఫణిశయ్యానుదలతునాదు ॥ భక్తిప్రప స్తిన్॥

ఏతత్సర్వంబును శ్రీసీతా రామార్పణమున్.

శ్రీమద్గురుం భజేభజేభజే

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

భా గ వ తా ప రా ధ గ జ కే స రి,

గురుశిష్యుల సంవాదమను గ్రంథము,

సం పూ ర్ణ ము.

---

శ్రీరస్తు.

# శ్రీ సద్గురు కీర్తనలు.

రాగము - ముఖారి - ఆదితాళము.

ఎందరైన గురునాథునితో సరి - యెంత వెదకినా లేరూ - యెందు జూచిన జ్ఞానరాశి - యాసుందరకారునితీరూ॥ ఎంద॥ ౧॥ దాపునుగోరియున్నంటి - నే - నపరాధిననియంటి - తాపత్రయమును బాపెనుదయతో - ఆపద్బాంధవుడైనపరాత్పరు॥ ఎంద॥ ౨॥ కోపమువద్దని తెలిపే - నా - పాపములన్నియు బాపె - చూపురూపుకనుపాపలనిల్పియు - ఆపోద్యోతై యలరుచునుండును॥ ఎంద॥ ౩॥ అంతమాయవినుమనియె - తా - నంతసాక్షిగనుమనియె - చింతలుమానెను శ్రీగురుదేవుడు - అంతులేనికరుణాంతరంగుడు॥ ఎంద॥ ౪॥ సాయనుబాపెనువేగా - మరి - మర్మముదెలిపెనుబాగా - చాయకనాగాదే శిశుబ్రహ్మము. శ్రేయంబొసగెనుశ్రీముకుందునకు॥ ఎందరైన॥ ౫॥

గురుదేవ భవహారుడూ - పూజించిన - నసుదేవురహరుడూ - పవిత్రత్వ - పరుదేనిర్భయుడూ - నవవిధభక్తా - భగుదేశాశ్వతుడూ॥ గురుదేము రహారుడాని - గురుపాదపద్మములు - మరువక హృత్కమల - మందునిల్పిన వాని॥ ధరణిలోపలవశముగాదు - సురలకునుసుర రాజగురులకు - విరివిగాపరమేష్టికైనను - తరమెనరులకుపరబ్రహ్మ॥ గురుదే॥ ౧॥ పరమాత్మదానీ - యల్లరూపుడూ - మరువాకపూనీ - ధ్యానించిన - పరిపూర్ణజ్ఞానీ - వర్ణించగా - తరమానవానీ॥ శరణుశరణనిమనసూ చొదరాకనిల్పిన - పరమాబ్రహ్మానంద భాగ్యాముచేకూరు - మరలజన్మామరణవస్తలు - ఎరిత్రపాపబద్ధభవాంబుధి - హరణమునుగావించి పరబ్రహ్మైక్యమొందగజేయుశ్రీ॥ గురుదేవ హరుడూ - పూజించిన॥ ౨॥ చతురువిధమూలా - శుశ్రూషాలు - మతిగదిరి చాలా - జేయుచునున్నదశదెసుసీలా - యనబడుసూపండితవాక్యమూగా॥ పాలితపావనసద్భక్తాగ్రగణ్యుడై - ప్రతిలేనిచిత్తోపరతిశాంతాశపహానా॥ అతులితాకల్యాణగుణగణమతి - కగోచరమానఘుండా - ద్యుతినివిస్వర్గే

భాస్కర- శతసహస్రకోటి తేజుడు॥ గురుడే॥ ౩॥ అంబారీకన్నా - మద్గురుభక్తా మందారుడెన్నా- సందడివంశ చంద్రుడోయన్నా- పదపద్మములందు దైగన్నా- సందేహములుమాని- సద్భక్తిగొలచినా అందాముపెనుగొండ మాకుందదాసునిబ్రోచె॥ అందుయిందూసంము లేకను- యందుజూచిననందరాకను- పొందుగను సద్భక్తహృదయానందుడౌ శ్రీరామమూర్తియు॥ గురుడేభవహారుడూ॥ ౪॥

రేగుప్తిరాగము - ఏకతాళము.

రామూనినమ్మనివారూ- లెస్సా- దామాలబడితిరిగెదారూ- రామూనినమ్మక పామారులంచారు- కామాకబడెచారు ఘనవీచి నరకమున॥ కామములోజిక్కియూలు ప్రేమబిడ్డలధనమదంబుల- భూమిలోచరియించువారికి దేముడన్నామాటలెక్కడ॥ రామూ॥ ౧॥ అచల రూపంబున నిలచియాలో- కచపాలత్వముబాపదలచి- అచలామైవిగ్రహ-హరిరూపమునధరలో ప్రచురమైనండెను పరికింపతరమౌన॥ నచట నచటాగుళ్ళుగట్టి నవవిధంబులపూజజేయగ- రచలనిందించుచునురాళ్ళని వచియించెదుశ్చరితులేడూ॥ రామూ॥ ౨॥ త్రొక్కిదిరాయిగాదా- గోడా- తాబ్రాలా కట్టదిగాదా- తక్కిడిమాటాలుమిక్కిలిబలుకూచు నెక్కిరించుదుమేమె ఎక్కువయనితిరిగె॥ నిక్కుబోతూలకునుజూడగ నెక్కడిదిసద్గతి యుధరలో- ముక్కుముక్కులు జేసికోతురు నిక్కముగయనుభటులు చేహము॥ రామూని॥ ౩॥ జపమూలు జేయాగజూచి- గొప్ప యపరాధమిదియానిరోసి- నిష్ఫలాలమైతేము- జపమువిడచితిమాని- కపటమనసూకులు ఘనులానిందించెటి॥ చపలులకు మోక్షంబు లేకను నపరిమితముగ జన్మసులెత్తుచు- కపిలురై దారిద్ర దుఃఖా కూపములో బడిపోదురింకా॥ రా॥ ౪॥ ధరనాగ యాచార్యునిగనియూ- తానూ తరియించెను గాజమువినియూ- కరమొప్పపెనుగొండ వరముకుందదాసు- నిరతామునమ్మెను నిర్మలభక్తితో॥ పరమగురుని జేరలేకను ప్రాణహింసలు జేసిపెట్టా- కరువుదీరా మెక్కిలెస్సా తిరిగిమెరిగె బొంగరుబోతులు॥ రామూనినమ్మని వారూ॥ ౫॥

రాగము - శంకరాభరణము - అటతాళం.

పాలించవమ్మా- జానకినమ్మా- పాలించవమ్మా- పాలించవమ్మా భూపతిపుత్త్రిపూజిత- [illegible]॥ పాలించ॥

[illegible]జననీ- మాయనుబాపి- యానందము గనీ- శృంగార రూపంబు రంగాగ పూజింతు- భంగపెట్టకునన్ను మంగళకర దేహ॥ పాలించ॥౨॥ మోసపుచ్చకుమీ- దాసులకెల్ల-దాసూనివినుమీ- భాసురంబుగనిన్ను ప్రార్థించం చుచున్నాడ- జేసినకర్మాముచెదరగొట్టుము వేగ॥ పాలించ॥౩॥ రామానీ రాణీ- భక్తులబ్రోచె ప్రేమనీదానీ- నీనామముదప్పక నిను వేడుచున్నాను- కామాములన్నియు కడకుద్రోచియు వేగ॥ పాలించ॥౪॥ దిక్కెవరు లేకా- నిను జేరితి నెక్కడికిబోకా- చక్కని మాయమ్మ సకలలోకేశ్వరి- ఘ్రి తిరాకనపోషించు నెక్కడికిపోబోకు॥ పాలించ॥ ౫॥ నాగార్యగురునీ- పూజించినీ నమ్మితిమదినీ- వేగా మ శ్రీఅచ్చమాంబస్వరూపిణి- బాగుగా నను గాంచవరముకుంమని లెస్సా॥ పాలించవమ్మా॥ ౬॥

మంగళహారతి.

రాగము - శంకరాభరణము - అటతాళం.

రామమంగళమానరే- సీతాపతికి భామమంగళమానరే- శ్రీమహా సత్పుత్రికి చిన్మయాసౌందర్యగాత్రికి- సోమభాస్కర నేత్రునకు కాముజ ర్ధభుప్రథునకు॥ రామా॥ ౧॥ పాపనాశని దేవికీ- ముల్లోకమాతకు- అజో జ్యోతిరూపికి- తాపములసంహారికి చైత్యమర్ధనసూరికి- సామజేంద్రుని నేలి న శ్రీరామునకు సీతాధిరాట్టికి॥ రామామం॥ ౨॥ కాలమృత్యుహారికీ-సురతా జవినుతకు- నీలాకాంచన దేహికి- ఫాలలోచనవినుతునకను పరబ్రహ్మరూ పునకును- నాలగాపరి దేవునకు వన మాలికి నిస్తులగాంగ వాళికి॥ రామా॥౩॥ నాగార్యరూపునకును- భక్తులనుబ్రోచే- ఆగామ వేద్యునకును- శ్రీగజేం ద్రపోషణకు యాశ్రితజనా మందారునకును- బాగుగాముకుందదాస భక్త పోషణుడైనవారికి॥ రామమంగళమానరే॥ ౪॥

రాగము - శంకరాభరణం - అటతాళం.

మంగళంబూ- మద్గురురంగానీకు- మంగళంబూ- మద్గురురాయ నీకు॥ బంగరూపల్లెమునరత్న రంగవల్లికలచలంగగ॥ మంగా॥ ౧॥ అచలా పూర్ణా- దుర్వచనాబ్ధిహరణా- అచలములో వేదాంతరహస్యా- వచనస చరాచరాపూర్ణ॥ మంగ॥ ౨॥ నిరుపమాన- నిరవయనిరభిమాన - యిరువ ది తత్త్వరూపం బరబ్రహ్మ నందమైనా॥ మంగ॥ ౩॥ కారణార్యా- మారివర్యా- మేరిమీసాటి యీ రేడు జగములో లేరు చూచినధీర

వర్యా॥ మంగళం॥ ౪॥ పరమపురుషా- తత్వార్థనిష్కారసారా- విరివిగా శ్రీ
నాగయార్యా- గురువరామీచరణములకు॥ మంగ॥ ౫॥ మందహాసా- బ్రహ్మా
నందవేషా- ఆనందముగ పెనుగొండ వరమూకుందదాస - డెంద వాసా॥
మంగాళంబూ మద్గురురంగా॥ ౬॥

రాగము - ధన్యాశి - అటతాళము.

నీరాజనమిదుగో సీతా- నారీశ్రీమణి నాయకా- వారిజాక్షా గైకొ
నుఘన- సుకీ మోక్షదాయకా॥ నీరా॥ ౧॥ రామగురు బ్రహ్మేంద్రనీపద-
రాజములు నేగొలచెదా- కామితార్థఫలంబునొసగర- కామకనునిసుదలచె
దా॥ నీరా॥ ౨॥ తత్వత్రయరహస్య ఆత్మ తత్వజ్యోతిరూపకా - సత్వగు
ణపరిపూర్ణ శ్రీపర- తత్వసర్వవ్యాపకా॥ నీరాజ॥ 3॥ నిర్విచారానిరాలం
బా నిత్యశాశ్వితబ్రహ్మమా- నిర్వికారా నిర్వికల్పా- నిర్మలచలానందమా॥
నీరా॥ ౪॥ సచ్చిదానందస్వరూప సాక్షీ యాత్మానాయకా- పచ్చవిల్తుని
జనకనీపద- పద్మములుయడబాయకా॥ నీరా॥ నాగయాచార్యస్వరూపక-
శ్రీగజేంద్రునిపోషకా - బాగుతిరుపన్యాళ్వారను - భక్తునేలుమువిడకా॥
నీరాజనమిదుగో॥

ఉత్పలమాలవృత్తము.

మూడుపురంబులున్ దిరిగి § మోదముతో నొకహంసరూపమై।
వాడిగశృంగముల్ గలవు § వాలము రెక్కలు నెత్తిమీదనున్।
జాడనెరుంగువారుఘను § చావరు పుట్టరు మళ్ళనెప్పుడున్।
స్నేమునగారువారికిని § యీస్థలిలో పలుకాడనెవ్వరున్॥

శ్రీగురుంభ శేభ శేభ జే.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.

